# జపాన్ సామ్రాజ్య కాంక్ష

[టానకా ప్రధాని రహస్య విజ్ఞాపన.]



అనువాదం :

చలసాని రామారాయ్

విజ్ఞాన సాహిత్య పసం

:: బెజవాడ ::

# పాఠకులకు

మనం కలిసికొని చాల కాలమైంది. '42 జూలో "విద్యుల్లత"ను ప్రకటించి నప్పుడు మీతో, సంవత్సరానికి నాల్గుప్రచురణలు తప్పకుండా ప్రచురిస్తానని, ఒక ప్రతిజ్ఞచేశాను. కాని ప్రస్తుతం, ప్రభుత్వం కంటోలు పెట్టినప్పటికీ, మా రెక్కట్టులో కాగితం ధర యెంత విపరీతంగా—మూడున్నర అమ్మేరీము 35 రూపాయలు—వున్నదో మీకు తెలిసినదేకదా! ఆ ప్రతిజ్ఞ నెరవేర్చటాని కెంతప్రయత్నం చేసినప్పటికి ప్రతిజ్ఞాభంగం జరుగుతుందేమోనని భయమేస్తోంది. అయినా శక్తి కొలదీ అల్లాజరక్కుండా ప్రయత్నిస్తాను. ఇది యీ సంవత్సరానికి రెండో ప్రచురణ. మొన్నీమధ్య, అంటే 1942 డిశెంబరులో "సోవియట్ వీర వనితలు" ప్రచురించాను. మీ ఆదరణాభిమానాల వల్ల అది మళ్లీ యీ నెలలోనే పునర్ముద్రిణకొచ్చింది. అదేవిధంగా ముందుకూడ ప్రోత్సహిస్తే కాగితం ధర యెంత విపరీతంగా వున్నా భయంలేదు. ఏమంటారు?

ఈపుస్తకం 1927 జూలై 25న జపాను ప్రధాని టానకా అప్పటిచక్రవర్తికి సమర్పించిన విజ్ఞాపన. ఇందులో జపాను ప్రభుత్వానికి ప్రపంచాన్నంతా జయించాలని యెంత సద్బుద్ధి వున్నదో, ఆ విజయసాధనకోసం యెటువంటి మార్గాలు అవలంబించాలో స్పష్టంగా చర్చించబడినాయ్. ఇంచుమించుగా ప్రతి సామ్రాజ్యవాద దేశానికీ యీసద్బుద్ధులే వుంటాయ్. ధనికవాద సమాజపు చేతిలోని కీలుబొమ్మయైన సామ్రాజ్యవాద ప్రభుత్వపు కాంక్షలెప్పుడూ యిలాగే వుంటాయ్.

ఈ విజ్ఞాపన ఒక్కచైనాను (మంచూరియా, మంగోలియా, కొరియా రాజ్యాలతో సహా) గురించే వుందికాని సోవియట్‌రష్యాకు, అమెరికాకు, ఇంగ్లండుకు, యించుమించుగా ప్రపంచానికంతకూ, ప్రాణాంతకమైన కార్యక్రమమే. ఈ

కార్యక్రమాన్ని నుసరించే 1931లో మంచూరియా ఆక్రమణ జరిగింది, తరువాత చైనా. నేటికి మనపవిత్ర భారతభూమిమీద. జపాన్ నుగురించి భారతదేశంలోవివిధాభిప్రాయాలుఅమలులో వున్నయ్. అవన్నీ పంచమాంగదళంవారు చేసున్న దుష్ప్రచార ఫలితాలే. ఎప్పుడూ సామ్రాజ్యవాద ప్రభుత్వం యేదేశాన్నీ దయతో వదిలిపెట్టదు. తన అవసరాన్ని తీర్చుకునే నిమిత్తం పైకి చాలదయతో వున్నట్లూ, ధర్మపాలనయే ముఖ్యసూత్ర మైనట్లూ ప్రవర్తించవచ్చుగాని, యదార్థాని కంత పవిత్రంగా వుండదు. ఈ విషయాన్ని యీపుస్తకంలోని విషయమే నిర్ధార ణచేస్తుంది. కాబట్టి నేడు జపాన్ రాజ్యాంగయంత్రం యొక్క నిజస్వరూపాన్ని తెలిసికోవటం చాల అవసరం. ఆయవసరాన్ని గుర్తించే, అవకాశం తక్కువైనప్పటికీ ఆవేశం తగ్గనందువల్ల యీ ప్రచురణను అందజేయ గలిగాను.

ఇకనుంచీ గ్రంధమాలను నూతన పద్ధతులమీద నడ పాలని సంకల్పం. ఈ వుద్దేశాన్ని నాల్గో ప్రచురణనుంచే అను సరిస్తున్నాం. మీ ప్రోత్సాహంవుంటే యెన్ని పుస్తకాలైనా అందించగలం. మార్కెట్లో కాగితం ధర విపరీతంగా వుండ బట్టి విధిలేక వుస్తకంధర కూడ విపరీతంగానే పెట్టాల్సి వ చ్చింది. పాఠకులు యీవిషయాన్ని గ్రహింతురుగాక!

ఇంగ్లీషునుంచి తెలుగులోనికి తర్జుమా చేయాలంటే చాల కష్టం. ప్రత్యేకంగా రాజకీయాల్ని చేయటం మరింత కష్టం. రాజకీయ పరిభాష తెలుంగులో లేదు. సహాయపడే నిఘంటువులూ లేవు. అందువల్ల బహుదోషాలుండవచ్చు. ప్రధమ యత్నం గాబట్టి మన్నిస్తారని విశ్వసిస్తూ,

బెజవాడ,
ఫిబ్రవరి '43.

విప్లవాభి వందనములతో
రామారావ్,
సంపాదకుడు.

ఐరోపా మహాసంగ్రామం జరిగినప్పటి నుంచి జపాను రాజకీయ, ఆర్థిక ఫలములు క్రమంతప్పి వుంటున్నై మనకు మంచూరియాలోను, మంగోలియాలోను వున్న ప్రత్యేక సౌకర్యాలను వుపయోగించుకోక పోవటం వలననూ, సంపాదించిన అధికారాలను పూర్తిగ అనుభవించ లేకపోవుట వలననూ యిలా జరిగింది. నేను ప్రధానిగా నియమింపబడి నప్పుడు, ప్రత్యేకంగా, ఆ భాగంలోని మన హక్కుల్ని రక్షించుకోవాలనీ, ముందు రాజ్యవిస్తరణకు కలిగే అవకాశాల్ని వేటినీ వృథా పోనివ్వకుండా వుపయోగించుకోవాలనీ హెచ్చరించ బడ్డాను.

ఇవి సామాన్య విషయాలు గావు. నేను సామాన్య పౌరునిగా నున్నప్పటి నుంచి మంచూరియా, మంగోలియాల విషయంలో పోజిటివ్ పాలసీ (నిర్మాణపంథా) కే అనుకూలంగా వుండేవాడిని. ఈ విధానాన్ని ఆచరణలో పెట్టటానికి నిరంతరం కృషి చేస్తున్నాను. ఈ పథకాలను — దూర ప్రాచ్య దేశాల్ని వలసరాజ్యాలుగా మార్చటానికీ, నూతన ఖండాంతర సామ్రాజ్యాభివృద్ధికీ— కార్యరూపంలో పెట్టి పనిచేయటానికి ఒక మహాసభను జూన్ 27 నుంచి జులై 7 వరకు—పదకొండు రోజుల మహాసభ - కూడ సమావేశ పర్చినాను. మంచూరియా, మంగోలియాలకు సంబంధించిన సైనిక, సివిల్ వుద్యోగులందరూ ఆ మహాసభకు హాజరైనారు. ఈ మహాసభలో జరిగిన చర్చల ఫలితంగా ఒక తీర్మానం చేయ బడింది. అదే యిప్పుడు తమ సమక్షాన వినయ విధేయతలతో పరిశీలనార్థం సమర్పించు కొంటున్నాము.

# పీఠిక

మంచూరియా, మంగోలియాలో ఫైంగ్‌టైన్, కిరిన్ హైలంగ్-కియాంగ్ రాష్ట్రాలు, అంతర్బహిర్మంగోలియాలను కలుపుకొని వున్నాయ్. ఈ రాష్ట్రం వైశాల్యం 74000 చ॥ మైళ్ళు. జనసంఖ్య 180 లక్షలు. కొరియా, ఫార్మోసాలను మినహాయిస్తే ఆరాష్ట్రం మన దేశజనసంఖ్యలో మూడవ వంతు వున్నప్పటికీ, వైశాల్యంలో మూడు రెట్లు పెద్దది. ఆ రాష్ట్రం ఆకర్షవంతంగా యెందుకున్నదంటే జనాభా తక్కువగా వుండటమేకాకుండా ప్రపంచంలో యెక్కడాలేని దట్టమైన అడవులు, ఖనిజసంపద, వ్యవసాయకవుత్పత్తి కూడవున్నై. అక్కడ యీసంపదల్ని దోచుకోవటానికీ, మన జాతీయ ప్రతిభను వ్యాపింప జేయటానికే ప్రత్యేకంగా దక్షిణ మంచూరియా రైల్వేకంపెనీ సృష్టింపబడ్డది. చైనాకు, మనకు లాభకరంగా వుండే పద్ధతుల ప్రకారం, మనం మన రైల్వే, నావికా, అరణ్య, ఉక్కు, వ్యవసాయక, పశువులపరిశ్రమలలో షుమారు 4400 లక్షల యెన్నులను (1 యెన్ను=1-8-0 రు.) ఖర్చు చేసి వుంటాము. నిస్సందేహంగా యిదే మనం పెట్టినవాటిల్లో పెద్ద పెట్టుబడి, బలమైన నిర్మాణం. ఈ వుద్యమం పేరుకు, ప్రభుత్వం, ప్రజల యొక్క వుమ్మడి యాజమాన్యాన నడపబడుతున్నట్లు కనపడుతున్నప్పటికీ యథార్థంగా ప్రభుత్వం చేతుల్లోనే వుంది. మన రాజ్యాంగ కార్య నిర్వాహణత్వంలోను, పోలీసు, రాజదూత కార్య నిర్వాహణత్వంలోను యివ్వబడిన అధికారాలకు సంబంధించినంతవరకు, యీ దక్షిణ మంచూరియా రైల్వేకంపెనీకి, కొరియా గవర్నరుజనరలు

కున్నన్ని అధికారాలున్నయ్. మంచూరియా, మంగోలియాల్లో మనకున్న శ్రద్ధ యీ విషయాన్ని బట్టి స్పష్టంగా తెలుస్తుంది. ఈ పద్ధతి మెడ్జీ చక్రవర్తి సూచనల ననుసరించి, ఆయన కాలంనుంచి ఆదేశానికి వర్తింప జేయబడుతోంది. నూతన ఖండాంతర సామ్రాజ్యాభివృద్ధికి తోడ్పడుతోంది. అదే మన జాతీయ ప్రఖ్యాతిని విస్తరింప జేయడానికి, అసంఖ్యాకమైన మనభవిష్యత్ జాతిపురోభివృద్ధికి అత్యావసరం.

దురదృష్టవశాత్తు ఐరోపా మహాసంగ్రామం జరిగినప్పటినుంచి స్వదేశ విదేశ రాజ్యాంగ నీతులలో నిరంతరం మార్పులు జరుగుతూ వచ్చినయ్. తూర్పు రాష్ట్రాల ప్రభుత్వాలుకూడ యేమరిపాటు లేకుండ అప్రమత్తతతో, మనలనే వుదాహరణగా తీసికొని, యంత్రాభివృద్ధికీ, పునర్నిర్మాణానికీ, తగు ప్రయత్నాలు జరుపుతున్నై. మన పలుకుబడిని యెంతో అడ్డగించిన, అత్యాశ్చర్యకరమైన విజయాలు కలిగినాయంటే మనం ఒప్పుకొనితీరాలి. ఇది మనలను ప్రతికూలమైన స్థితిలో వుంచింది. నిరంతరం మార్పు చెందుతూవున్న మంచూరియా మంగోలియా ప్రభుత్వాలతో జరిపిన రాయబారాలను కూడ విఫలం జేసింది. పైగా నవరాజ్యాల ఒడంబడిక (వాషింగ్టన్ మహాసభలో సంతకం చేసినది) అక్కడ (మంచూరియా మంగోలియాల్లో) మన స్వాతంత్ర్యం అంతా పోయేటంత పర్యంతం మన ప్రత్యేకహక్కుల్ని అడ్డగించింది. మన దేశపు ఉనికికే భంగం కలిగించింది. ఈ అవాంతరాలు గనక మనకు తప్పకపోతే మన వునికికే క్షేమంకాదు; మన జాతీయాధికారం అభివృద్ధి కాదు. పైగా, ఉత్తర మంచూరియాల్లో పరిశ్రమలన్నీ కేంద్రీకరించబడి వున్నై. ఉత్తర మం

చూరియాలోనికి వెళ్ళటానికి మనకు అవకాశం లేకపోతే ఆ దేశంలోని సంపదను ముట్టుకోవటానికైనా వీలులేదని స్పష్ట మౌతుంది. రష్యా-జపాన్ యుద్ధంలో మనం స్వాధీనపర్చు కొన్న దక్షిణ మంచూరియాలోని వుత్పత్తిస్థానాల మీద కూడ మన అధికారానికి నవరాజ్యాల ఒడంబడిక తీవ్రంగా అడ్డు తగులుతున్నది. దాని ఫలితంగా మన ప్రజలు మంచూ రియాకు స్వేచ్ఛగావలస వెళ్ళటానికి వీలు లేకపోయేటప్పటికి, చైనా ప్రజలు ఆ అవకాశాన్ని వుపయోగించుకొని వేలకొలదీ అక్కడకు వెళ్ళి నివాసం యేర్పరచుకొంటున్నారు. ప్రతి సం వత్సరం అనేక లక్షలమంది చైనా ప్రజలు (మూడు) ప్రాచ్య రాష్ట్రాలలో నివాసాల నేర్పరచుకొంటున్నారు. ఆవిధంగా వారు మంచూరియా, మంగోలియాల్లో మన హక్కుల్ని- ప్రతిసంవత్సరం 8 లక్షలమందికి పైగా వున్న (జపాను) అధిక జనాభా పొందే రక్షణను -కాజేస్తున్నారు. ఈ విషయంలో, అంటే మన దేశజనాభాకు కావలసిన ఆహారపదార్థాల సప్లై విషయాన్ని, సరిజేయలేక పోయామని ఒప్పుకుతీరాలి. ఈ చైనావలసను అరికట్టటానికి తగు ప్రయత్నాలు వెంటనే చేయకపోయినట్లైతే అయిదు సంవత్సరాలయ్యేటప్పటికి వారి సంఖ్య 60 లక్షలకు మించిపోతుంది. అప్పుడు మనం మంచూ రియా, మంగోలియాలలో చాల కష్టనష్టాల్ని యెదుర్కో వలసి వస్తుంది.

నవరాజ్యాల ఒడంబడికమీద సంతకం జేసినప్పుడు, మంచూరియా, మంగోలియాల్లో మన స్వాతంత్ర్యానికి అడ్డు వచ్చినప్పుడు, మన ప్రజాభిప్రాయంలో చాల ఆందోళన బయలుదేరింది. కీర్తిశేషులైన మైస్కో చక్రవర్తి యూగమటా

వగైరా సైనికోద్యోగులతో గూడిన ఒక మహాసభను మనకు క్రొత్తగా సంభవించిన యీ బాధ్యతను నిర్వర్తించు విషయ చర్చలకోసం పిలిచారు ఈ విషయాన్ని గురించి ఆయా రాజ్యాల రాజకీయ ప్రముఖుల అభిప్రాయాలు యెలా వున్నాయో తెలిసికోవటానికి నన్ను అనధికారరీత్యా ఐరోపా, అమెరికాలకు పంపారు. వారంతా, ఆ ఒడంబడిక అమెరికా సంయుక్త రాష్ట్రాల ప్రోద్బలమువల్లనే జరిగిందని తేల్చారు. ఆ ఒడంబడికమీద సంతకాలు పెట్టిన యితర రాజ్యాలు, మనకు అంతర్జాతీయ వర్తకంలోను, పెట్టుబడులలోను మనలను మనము రక్షించుకోగలశక్తి వుంటే, మంచూరియా, మంగోలియాల్లో మన పలుకుబడిని వ్యాపింప జేసికొనే విషయములో వారి అభ్యంతరం యేమాత్రం లేదని చెప్పారు. ఇంగ్లాండు, ఫ్రాన్సు, ఇటలీ రాజకీయ వేత్తలు నాతో రహస్యంగా యీ పై ప్రకటనకు అనుకూలంగా వారివారి ఇష్టాల్ని వెలిబుచ్చారు. దురదృష్టవశాత్తు, మన పద్ధతిని అమలులోపెట్టిన నవ రాజ్యాల ఒడంబడిక ఆచరణీయంకాదని—ఐరోపా రాజ్యాంగ వేత్తల అనుమతితో—ప్రకటించబోయే సమయానికి సియుకన్ క్యాబినెట్ అకస్మాత్తుగా ముగిసింది. అందువలన మన పంథా అమలులో పెట్టలేకపోయాము. దీనికి మేము చాల విచారిస్తున్నాము. ఐరోపా రాజ్యాలవారితో మాట్లాడివచ్చిన తర్వాత షాంగై వెళ్ళాను యీ విషయాన్ని గురించి మాట్లాడదామని. † షాంగైలో ఒక చైనీయుడు నన్ను పరిమార్చా

† ఈసంఘటననుబట్టి జపానుయందు చైనీయులకు యెంతగౌరవ భావంవున్నదీ తెలుస్తుంది. వారిముష్కర సామ్రాజ్యవాద సిద్ధాంతాలే ప్రజల్ని వారికి విరోధులుగా మార్చినై. వారు మానవసమాజానికే శత్రువులు.

—ఎడిటర్,

లని చూచాడు. నా పూర్వ జపాను చక్రవర్తుల కర
ణాకటాక్ష వీక్షణాలవల్ల ఆ ప్రమాదాన్ని తప్పించుకొన్నాను
కాని ఒక అమెరికా శ్రీకి దెబ్బలుతగిలినాయ్. ఆదయామయు
డైన ఈశ్వరుని కృపవలన భవిష్యత్ జపాను పురోభివృద్ధికి
పాటుబడటంకోసం, దూర ప్రాచ్యంలో ఒక నూతన శకాన్ని
ఆరంభించటానికి, ఖండాంతర సామ్రాజ్య విస్తీర్ణతకు పాటు
బడటానికి యింకా బతికే వున్నాను. ఇది ఈశ్వరాదేశము !

దూరప్రాచ్యంలో ఆ తూర్పు రాష్ట్రాలు మూడు,
రాజకీయంగా అసంపూర్ణ స్థితిలో వున్నాయ్. జపాను, ఆసి
యాలో (Blood and Iron) పైశాచిక విధానం వుపయోగించ
కుండా స్వరక్షణ విషయములో వచ్చే కష్టాల్ని తొలగించ
లేదు. మనము యీ పద్ధతిని అనుసరించటతో, విషంతో
విషాన్ని విరిచించాలనే పద్ధతిని చైనాలో వుపయోగిస్తున్న
అమెరికాతో ముఖాముఖిగా యెదురోవలసి వస్తుంది.
మనము చైనామీద అధికారాన్ని సంపాదించాలంటే ముం
దుగా అమెరికాను నాశనం చేయాలి. అంటే, రష్యా–జపాన్
యుద్ధములో ప్రవర్తించినట్లుగానే యిప్పుడుగూడ అమెరి
కాతో ప్రవర్తించాలన్న మాట. చైనాను జయించాలంటే
ముందుగా మంచూరియా, మంగోలియాల్ని జయించాలి.
మనం చైనాను జయించగలిగినామంటే తక్కిన ఆసియా
ఖండములోని దేశాలు, దక్షిణ సముద్రములోని దేశాలు
అన్నీ మన అధికారానికి లోబడి మనకు భయపడి వుం
టాయ్. అప్పుడు తూర్పు ఆసియా అంతా జపానుదేననీ,
మన హక్కుల్ని యెవ్వరూ భగ్నపర్చలేరనీ ప్రపంచం
తెలిసికొంటుంది. మెజ్జి చక్రవర్తి మనకు యిచ్చిన ప్లాను

యిదే. ఇది మన జాతీయ వునికికి యెంతో అండగావుండి మన భవిష్యత్ కార్యక్రమ విజయానికి యెంతో తోడ్పడుతుంది.

వర్తక కలహాల ప్రతిబింబమే యీ నవరాజ్యాల ఒడంబడిక. ఇంగ్లండు, అమెరికాలు తమ తమ బలంతో చైనాలో మన పలుకుబడిని నాశనం చెయ్యాలని తలంచినై. సైన్యాన్ని అదుపు ఆజ్ఞల్లోవుంచాలనే తలంపు, మన సైనికబలాన్ని తగ్గించటముకోసము, చైనాలో పెద్దభూభాగాన్ని జయించగల అవకాశాన్ని లేకుండా చేయటంకోసమే తప్ప మరొకందుకేమీ కాదు. పోతే చైనాలోని సంపత్తి అంతా ప్రత్యేకంగా వారి చేతుల్లోనే వుంటుంది. ఇంగ్లండు, అమెరికాలు కలిసి మన యెత్తులను నాశనము చేయటానికి పన్నినపన్నుగడయే యీ ఒడంబడిక. మైన్సిటో ప్రభుత్వం యీ నవరాజ్యాల ఒడంబడికనుగురించి చాల వ్యవహారముజరిపి, చైనాలో మనహక్కులకంటె వర్తక విషయానికే యెక్కువ ప్రాధాన్యత యిచ్చింది. ఈ పద్ధతితప్పు. ఇది జాతీయ ఆత్మహత్యకు దారితీస్తుంది. ఇంగ్లండుకు ఆహారపదార్థాలు, తదితర వస్తువులు సరఫరాజేసేవి ఆస్ట్రేలియా, ఇండియాలు వున్నవిగాబట్టి, తను వర్తకాన్ని గురించి సరదాగా కబుర్లుచెబుతుంది. అలాగే దక్షిణఅమెరికా, కెనడాలున్నవి గాబట్టి అమెరికావారు కూడ చైనాలో వర్తకాభివృద్ధి ద్వారా తమ సంపద నభివృద్ధిచేసికోవటానికి తమశక్తినంతా పూర్తిగ వుపయోగించగలరు. కానిజపానులో జనసంఖ్య పెరిగిన కొలదీ నిల్వజేసిన ఆహారపదార్థాలు, ముడిసరుకులు తరిగిపోతున్నయ్. మన ఆశలన్నీ ఒక్క వర్తకాభివృద్ధిమీదనే పెట్టుకకూర్చుంటే, అజేయమైనపెట్టుబడిశక్తిగల ఇంగ్లండు, అమెరికాలు మనల్ని సర్వనాశనం చేస్తాయ్. చివరకు

మనకు మిగిలేది పూర్ణానుస్వారం. కాని అంతకంటె అతి ప్రమాదకరమైన విషయము యేమిటంటే, చైనా యెప్పుడో ఒకనాడు గాఢనిద్రనుండిమేల్కొనవచ్చును. ఈ అంతఃకలహాలసమయం లోగూడ వారు ప్రశాంతముగానే, మనకు తాటాకులుకట్టటానికి ప్రయత్నించి, మనవస్తువుల్ని బహిష్కరించి మన వర్తక పతనానికి ప్రయత్నించవచ్చు. చైనా, "మన కాతాదారు" అనే విషయాన్ని గుర్తుంచుకొంటే, చైనా ఐక్యతజెంది, పారిశ్రామికాభివృద్ధి పొందేరోజు ముందున్నదంటే మనము భయపడాలి. అంటే చైనా జాతీయైక్యతను పొందిందంటే మనకు తీరని నష్టము. అమెరికా, ఐరోపాలు మనతో పోటీకి వస్తాయ్. అప్పుడు చైనాలోని మనవర్తకానికి తిలోదకాలివ్వవలసినదే. మైన్సిటో ప్రభుత్వం యిచ్చిన సలహాప్రకారము, నవరాజ్యాల ఒడంబడికను అమలులో పెట్టి, మంచూరియాలో ఒక్క వర్తకాభివృద్ధికే మనము ప్రయత్నించామంటే ఆత్మహత్య చేసికోవటానికి ప్రయత్నించట మన్నమాట.

మన దేశంలో ప్రస్తుత పరిస్థితుల్ని, అవకాశాల్ని బాగుగా ఆలోచిస్తే, మంచూరియా, మంగోలియాల్లోని మన హక్కుల్ని సంరక్షించుకోవటానికి అవసరమైన ప్రయత్నాలు చేయటం మన ముఖ్య కర్తవ్యమని గుర్తించాలి. అవి మన వర్తకాభివృద్ధిని అడ్డగించటమేకాకుండా ఐరోపా రాజ్యాల ఆక్రమణను కూడ అరికడ్తాయ్. ఇది ఒక్కటే తెలివిగల పద్ధతి. ఇంతకంటె మంచి పద్ధతి యింకొకటి లేదు.

మనము మంగోలియా మంచూరియాల్లో నిజమైన హక్కుల్ని సంపాదించటానికి యీ రాష్ట్రాల్ని కేంద్రంగా

పెట్టుకొని, వర్తకమిషతో నెమ్మది, నెమ్మదిగ చైనాలోనికి జొరబడి చైనాను కూడ ఆక్రమించుకొనవచ్చును. ఇది వరకే సాధింపబడిన హక్కుల సహాయంతో, నాయుధంగా ఆ భూభాగము యొక్క వుత్పత్తిస్థానాలనే కొల్లగొట్టాము చైనా సంపత్తినంతా మన చేతులో వుంచుకొని, ఇండియా, ఆర్చిపిలగో, ఆసియా మైనరు, మధ్య ఆసియాల విజయానికి బయలుదేర్తాము. కాని మనము ఆసియా ఖండములో సామ్రాజ్యాన్ని స్థాపించి సుస్థిరంగా నిలుపుకోవాలంటే, ముందుగా మంచూరియా, మంగోలియాల్లో అధికారాన్ని మన కైవశంచేసికోవాలి. ఏదేశానికైతే, ఆహారపదార్థాల నిల్వ యెక్కువగా వుంటుందో, ఆ దేశమే అంతిమ విజయాన్ని పొందుతుంది. ఏ దేశము ఆహారపదార్థాల్నీ ముడిసరుకుల్నీ భద్రపర్చుకుంటుందో ఆ దేశములోనే పారిశ్రామికాభివృద్ధి సమృద్ధిగా జరుగును. తన అధికార ప్రాబల్యత యెంత దూరం వ్యాపిస్తే అంత జాతీయాధికారం యెక్కువౌతుంది. అంటే సామ్రాజ్యము విస్తరించినకొలదీ జాతీయాధికారము యెక్కువౌతుంటుంది. మనము, యీ నిర్మాణ పంథాను అనుసరిస్తే, మంచూరియా, చైనాల్లో అధికారాలు యెక్కువైనకొలదీ మహాసామ్రాజ్యానికి కావలసిన యీ పరిస్థితులన్నీ సమస్యలుగానే వుండవు. పైగా మనకు ప్రతి సంవత్సరము 7 లక్షల మంది అధిక జనాభాకు, స్థానము దొరుకుతుంది. మనము గనుక ఒక క్రొత్త పద్ధతిని ప్రారంభించి శాశ్వతముగా మన సామ్రాజ్య ప్రజలకు మేలుచేకూర్చాలంటే తప్పకుండా మంచూరియా, మంగోలియాల్లో నిర్మాణ పంథాను అమలులో పెట్టాలి.

– మంచూరియా, మంగోలియాలు చైనారాజ్యాలుకాదు –

చరిత్రాత్మకంగా చూస్తే మంచూరియా, మంగోలియాలు చైనారాజ్యాలూకాదు, చైనాఅధికారం క్రిందనూ లేవు.

డాక్టరు యానో చైనాచరిత్రను పరిశోధనచేసి చివరకు మంచూరియా, మంగోలియాలు యెప్పుడూ చైనారాజ్యాలు కావని నిర్ధారణజేశాడు. ఈపరమసత్యాన్ని ఇంపీరియల్ విశ్వ విద్యాలయం (అధికారరీత్యా నియమింపబడిన) ప్రతినిధి ప్రపంచానికి వెల్లడిచేశాడు. డాక్టరు యానో పరిశోధనలు, యేచైనా ప్రొఫెసరూ కూడ కాదనలేనంత జాగ్రత్తగ జరుపబడ్డాయ్ అయినప్పటికీ రష్యా యుద్ధములోనూ, మన ప్రభుత్వం బహిరంగంగా వాషింగ్టన్‌లో నవరాజ్యాల ఒడంబడిక మీద సంతకముచేసినప్పుడూ కూడ ఆదేపని చేయటం, తక్కిన రాజ్యాలమీద చైనారాజ్యాధికారాన్ని అంగీకరించింది. ఎంతైనా తెలివితక్కువపని అయింది. ఈ రెండు తప్పుల్ని చేయుటంవలన, మంచూరియా, మంగోలియాలమీద చైనా అధికారాన్ని అంగీకరించటంవలన యిప్పుడు దాని ఫలితంగా మనహక్కులకు యెంతో భంగం కలిగింది. చైనా, పంచ రాజ్యాల ప్రజా ప్రభుత్వాన్ని గురించి మాట్లాడుతున్నప్పటికి, టిబెట్, సింక్యియాంగ్, మంగోలియా, మంచూరియా ప్రజలు తమ, తమ పూర్వపు ప్రత్యేక రాష్ట్రాలలోనే వుంటున్నారు. ఆయా రాజకుమారులు వారి, వారి ఆచారవ్యవహారాల్నే అనుసరిస్తున్నారు. అందువలన యదార్థానికి ఆరాజకుమారులు సామ్రాజ్యాధికారాలను అనుభవిస్తున్నారన్న

మాట. మనం, మనకు దొరికిన ప్రథమ అవకాశంలోనే పరిస్థితుల యథార్థస్వరూపాన్ని ప్రపంచానికి తెలియజెయ్యాలి. దేశాన్ని సంస్కరించటంకోసం, మనము అంతర్బహిర్గంగా మారియా; మంగోలియాలను స్వాధీనపరచుకొన వలసివుంది. రాజకుమారులు తమ, తమ పూర్వరాజ్యాంగ విధానాలనే అమలులో వుంచితే, సామ్రాజ్యాధికారాలు వారి చేతుల్లోనే వున్నాయన్నమాట. మనము ఆరాజ్యాలను స్వాధీనపరచుకోవాలంటే వారినే- రాజకుమారుల్ని— నిజమైన పరిపాలకులుగా యెంచి వారి హక్కులరక్షణ విషయములో రాయబార ప్రయత్నాలు జరపాలి. మనకు చక్కని అవకాశం దొరుకుతుంది మన జాతీయ పలుకుబడి వృద్ధిచెందుతుంది.

— మంచూరియాలో మన నిర్మాణ పంథా —

మంచూరియాలో మన హక్కుల్ని సంరక్షించుకోవాలంటే అవసరమైన నిచ్చిత కార్యక్రమాన్ని, 21 కోర్కెలననుసంచి యీక్రింది కోర్కెలను గూడ సంపాందించుకోవాలి.

1. 1931 తో మనవర్తకపు టొడంబడిక గడువు ముగిసిన, తిరిగి మన యిష్టం వచ్చినంతకాలంవరకూ ఆ ఒడంబడిక గడువును పొడిగించాలి. తరువాత భూమినికూడ, పారిశ్రామిక, వ్యవసాయుక, వర్తకపు వ్యవహారాలకు, కౌలుకు తీసికొనే అధికారాన్ని గూడ సంపాదించాలి.

2. మంగోలియా తూర్పు భాగములో, జపాను పౌరులు ఆరాజ్యంగుండా ప్రయాణం చేయటానికి, నివసించటానికి, పారిశ్రామిక, వర్తకవ్యవహారాల్లో జోక్యం కలుగజేసి

కోవటానికి, అధికారము కావాలి. చైనా తన చట్టానికి వీరిని గురిచేయరాదు. వారిమీద చట్టవిరుద్ధమైన పన్నులు విధించరాదు. చట్టవిరుద్ధంగా ప్రశ్నించరాదు.

3. మనము షైంగ్టిన్, కిరిన్‌లోనువున్న 19 బొగ్గు, యినుముగనులను దోచుకోవటానికి, అక్కడి దట్టమైన అడవుల్ని దోచుకోవటానికి అధికారాలు సంపాందించాలి.

4. దక్షిణ మంచూరియాలోను, తూర్పు మంగోలియాలోను రైలుమార్గాలు నిర్మించటానికి లేక అటువంటి కార్యాలకు పెట్టుబడులు పెట్టటానికి మనమే ప్రథమ అవకాశాల్ని పొందాలి.

5. జపాన్ రాజకీయ, ఆర్థిక, సైనిక సలహాదారుల్ని యెక్కువజేయాలి. మన సలహాదారులే వారికి సలహాలనివ్వటానికి ప్రథమ అవకాశాలు వుండాలి.

6. చైనాలో వున్న కొరియన్లను సంరక్షించేనిమిత్తము పోలీసు స్టేషన్లను నిర్మించే అధికారము మనకుండాలి.

7. కిరిన్ - చాంచంగ్ రైల్వే అధిష్ఠానకాలం దాని అభివృద్ధికి, కౌలుకాలం 99 సంవత్సరాలకు పొడిగించాలి.

8. మనకు ప్రత్యేక వస్తువుల్ని అమ్ముకోవటానికి, ప్రత్యేకాధికారం కావాలి. ఐరోపానుంచి అమెరికాకు నౌకా వ్యాపారాన్ని బలపర్చే ప్రథమ అధికారావకాశాన్ని మనం పొందాలి.

9. హైలంగ్-కియాంగ్‌లోని ఖనిజసంపదను వుపయోగించుకోవటానికి ప్రత్యేకాధికారాలు కావాలి.

10. కిరిన్-హొయిరెన్, త్సెన్-త్సెన్-డలై రైల్వేలను నిర్మించే హక్కును మనం పొందాలి.

11. చైనా తూర్పు రైల్వేను కొనటానికి చైనాకు డబ్బు కావలసివస్తే పెట్టుబడిపెట్టటానికి ప్రథమ అవకాశం జపాన్ ప్రభుత్వానికే యివ్వాలి.

12. అంటిన్, యింకోరేవు స్థలాల్లో మనకు ప్రత్యేకాధికారాలు కావాలి. ఈ హార్బర్లలో రాకపోకల (రవాణా) అధికారాలు కూడా కావాలి.

13. మనం, ఆ మూడు తూర్పు రాజ్యాల సెంట్రల్ బ్యాంకిలో భాగస్వాములుగా వుండాలి.

14. మనము అక్కడి సంపదల్ని దోచుకొనే అధికారాల్ని కలిగివుండాలి.

—అంతర్బహిర్మంగోలియా విషయములో నిర్మాణ పంథా—

మంచూరియా, మంగోలియాలు స్వదేశ సంస్థానాధీశుల చేతులలో వున్నంతకాలము భవిష్యత్తులో వారినే ఆయా రాజ్యాల పరిపాలకులుగా నెంచి వారికి మన వూత నివ్వవలసి వస్తుంది. ఈ విషయాన్ని దృష్టిలో వుంచుకొనే క్వాంటన్ గవర్నరు జనరల్ కూతురు ఫుకుషిమా అనాగరకులైన మంగోలియన్ల మధ్య, టుస్చిటోలో నివసిస్తూ, తన జీవితాన్ని కష్టపెట్టుకొని అక్కడి రాజకుమారునికి సలహాదారుగా పని చేస్తూ తన ప్రభుత్వానికి సేవచేసింది. మంచూరియా రాజకుమారుడు 'సూ' మేనగోడలు రాజప్రతినిధి భార్యయైనప్పటి నుంచి మంగోలియా రాజకుమారులకు, ప్రభుత్వానికి మధ్యనున్న సంబంధము చాల దగ్గర పడినది.

అంతర్బహిర్మంగోలియాల్లో రాజకుమారులందరూ మనల్ని యెంతో గౌరవంగా చూస్తున్నారు. ప్రత్యేకముగా

వారికి సౌకర్యాల్ని అధికంచేసి, వారి రక్షణ విషయములో హామీ యిచ్చినప్పటి నుంచి యెక్కువైంది. ఇప్పుడు టుస్చిటోలో 19 మంది పింఛన్ పుచ్చుకొన్న జపాను అధికారులు వున్నారు.

మనము అప్పుడే ఉన్నివర్తకాన్ని మనదిగా చేసికొన్నాము. ఖనిజ సంపత్తిని దోచుకొన్నాము కూడ. ఇంకా చాల మంది రిటైర్డ్ ఆఫీసర్లని రహస్యంగా పంపించాలి. ముక్డెన్ ప్రభుత్వము దృష్టిపడకుండా వారు చైనావారివలె వేషమువేసికోవాలి అక్కడక్కడ జేరి వ్యవసాయం, పశువుల మేతపరిశ్రమ, ఉన్నిపరిశ్రమలో పాల్గొనవచ్చు. అక్కడి రాజకుమారులతో టుస్చిటో రాజకుమారునితో పవర్తించినట్లుగానే ప్రవర్తించవచ్చు. ఆరాజకుమారుల మీద అధికారాన్ని సంపాదించటానికి ప్రతిచోట మన రిటైర్డు ఆఫీసర్లు వుండాలి. అంతర్బహిర్మంగోలియాల్లో సరిపడునంతమంది జపానుపౌరులు ఆక్రమించుకొన్న తరువాత నెమ్మదిగా ఆభూమిని పదియవవంతు ధరకు కొనివేసి ధాన్యము (వరి) పండించవచ్చును. ఆవిధముగా ఆహారపదార్థాలనిల్వను యెక్కువజేయవచ్చును. ధాన్యము పండనిస్థలాల్లో పశువుల్ని గుఱ్ఱాల్ని మేపవచ్చు. పశువుల్ని మేపటమువలన ఆహారపదార్థాల సరఫరా జరుగుతుంది. గుఱ్ఱాల్ని మేపటం మన సైనికాభివృద్ధి ప్రయత్నాలకెంతో అవసరము. ఇంకా యితరస్థలాల్లో పండ్లపరిశ్రమలో పాల్గొనవచ్చును. ఐరోపా, అమెరికాలకు మన సరుకుల్ని యెగుమతి చేయవచ్చును. బొచ్చు, తోలు పరిశ్రమల్ని అభివృద్ధిచేయటము వలనకూడ మనకు యెంతో లాభమువుంది. చివరకు మంగోలియా అంతా మనహస్తగతమౌతుంది. సా

ప్రామాజ్యాధికారాల విషయము వివరముగా తేలలేనుగాబట్టి, రష్యా చైనాలు యితర వ్యవహారాల్లో సమగ్నమైవున్నైగాబట్టి మన పలుకుబడిని పెంపొందించుకోనచ్చు. మన చేతులో పెద్దభూభాగం వుంటే మంగోలియా జపాన్‌కు చెందుతుందా, లేక మంగోలియన్లకే చెందుతుందా అనే ప్రశ్నయే యింకవుండదు. ఇకా మిలిటరీబలాన్ని ఆధారంచేసికొని మన నిర్మాణపంథాను అమలులో పెట్టుకోవచ్చును. ఈ కార్యసాధన కోసం (యుద్ధకార్యాలయ రహస్య ధనములో నుంచి) ఒక కోటియెన్నులను ఖర్చుపెట్టి 400 మంది రిటైర్డు ఆఫీసర్లను మంగోలియాకు పంపాలి. ఈ ఆఫీసర్లు చైనాదుస్తులు ధరించి చైనా పౌరులలాగ వేషంవేసికొని వుపాధ్యాయవృత్తి నవలంబించి చైనాప్రజలమధ్య నివసిస్తూ ఆరాజకుమారుల విశ్వాసము చూరగొనాలి. వారివద్దనుంచి గనులుత్రవ్వటము, పశువుల పరిశ్రమలలో పాల్గొనే అధికారాల్ని పొందాలి. ఆవిధంగా ముందు శతాబ్దానికంతకీ, మన జాతీయాధికారానికి పునాది వెయ్యాలి.

## — కొరియా వలసయొక్క రక్షణ —

కొరియా ఆక్రమణ జరిగినప్పటినుంచి మనకంత పెద్ద కష్టం కలుగలేదు. జాతి స్వయంనిర్ణయత్వం విషయములో ఐరోపా మహాసంగ్రామము జరిగిన తర్వాత విల్సన్ అధ్యక్షుడు చేసిన ప్రకటన నిజంగా నిమ్నదేశాలకు గొప్పమేలు చేకూర్చింది. కొరియాలోగూడ అసంతృప్తి వ్యాపించింది. కొరియా ప్రజలు అనుభవిస్తున్న స్వాతంత్ర్యంవల్ల, పోలీసు శాఖా నిర్మాణలోపంవల్ల, వారిదేశంలోవున్న సంపదవల్ల

కూడ షుమారు లక్షమంది కొరియా ప్రజలు ఆ మూడు తూర్పు రాష్ట్రాలలో వున్నారు. ఈ అభివృద్ధి మనకు చాల లాభకారి. ఆర్థిక, సైనిక దృష్టితో చూస్తే మన పలుకుబడి చాల హెచ్చింది. పైగా కొరియా ప్రజల ప్రభుత్వ నిర్మాణ విషయంలో కొత్త ఆశయాన్ని రేకెత్తించింది.

మనం నిర్మానుష్య స్థలాన్ని ఆక్రమించుకోవటానికి మనకు వారు వాన్ (సైనిక శ్రేణికి ముందుండు సైనికభాగము) వలె పనిచేస్తారు. తరువాత చైనా ప్రజలకు, మనలకు మధ్యవర్తులుగా కూడ వుంటారు. ధాన్యం పండించటానికి భూముల్ని కొనే విషయములో స్వదేశీయులైన కొరియన్లను, మన దక్షిణ మంచూరియా రైల్వే సహకార సంఘాలద్వారా వారికి ఆర్థికంగా అండగా వుండి వుపయోగించుకోవచ్చును. ముందుగా మనము ఆర్థికంగా అభివృద్ధి కావటానికి వారిని వుపయోగించుకోవచ్చు. ఆహార పదార్థాల నిల్వ విషయములో మన శ్రమల్ని తగ్గించి మన వలస ప్రయత్నాలకు కొత్త అవకాశాన్ని కలుగజేయటానికి తోడ్పడుతుంది. చైనీయులుగా మారినా కొరియన్లు (మర్యాదకోసము) వూరికినే అలా పైకి కనిపిస్తారేగాని తర్వాత మనలోనికి తిరిగిపోతారు. కాలిఫోర్నియా, దక్షిణ అమెరికాలకు వలసపోయిన జపానీయులతో వీరిని పోల్చరాదు. వారు తాత్కాలికంగా మాత్రమే చైనీయులుగా మారారు. వారు షుమారు 25 లక్షల మంది పైగా అయిన తరువాత మనకు అవసరమైతే వారిని సైనిక కార్యాలకు పురికొల్పవచ్చును. కొరియన్లను అణుస్తున్నామని చెప్పి వారికి అండగా వుండవచ్చును. కొరియన్లంతా యింకా చైనా పౌరులు కాలేదుకనుక యీ అల్లర్లు చేసింది నిజంగా

చైనీయులో, (చైనాపాలన క్రింద వున్న కొరియన్లో) జపానీయులో (జపానుపాలన క్రిందవున్న కొరియన్లో); యితర దేశాల వారు తెలిసికోవటం చాల కష్టం. ఆవిధంగా ప్రపంచాన్ని యెప్పుడూ, తప్పుడు మార్గాల్లో పెట్టాలి. మనం కొరియన్లను యీవిధముగా వుపయోగించుకోగలం. కాని చైనీయులు మనకు వ్యతిరేకంగా వారిని వుపయోగించుకోకుండా వుండటానికి తగుయత్నాలు చేయాలి. మంచూరియా, మన అధీనంలో యెంతవుందో, చైనా అధీనంలోకూడ అంతేవుంది. చైనా, మనమీద యుద్ధానికి కొరియన్లను వుపయోగించుకొంటే చైనామీద యుద్ధముచేయటాని కొకసాకు దొరుకుతుంది. ఆ విషయములో సోవియట్ రష్యా మనకు అతిప్రమాదకరమైనదిగా వుంటుంది. చైనీయులు, కొరియా ప్రజలను స్వాధీన పరచుకోవటానికి 'రెడ్ ఇండియన్ల' సహాయాన్ని వుపయోగించుకొంటే మనప్రజల దృష్టికూడ మారుతుంది. పైగా మనకు గొప్ప ప్రమాదావస్థ తటస్థిస్తుంది. ఈవిషయాన్ని దృష్టిలో పెట్టుకొనే, ప్రస్తుత క్యాబినెట్ అటువంటి అవకాశము కలుగకుండా తగుచర్యల్ని తీసికొంటోంది. మన ఖండాంతర సామ్రాజ్య విస్తరణకోసం కొరియన్లను వుపయోగించుకోవాలంటే, వారి రక్షణ కార్యాలను వీలైనంతవరకు జాగ్రత్తగ నెరవేర్చాలి. ఉత్తర మంచూరియాలో మన పోలీసుశాఖను, మిట్సుయియా ఒడంబడిక ననుసరించి, కొరియన్ల రక్షణార్థం, వారి శీఘ్రపురోభివృద్ధికి తోడ్పడటానికి అభివృద్ధిపర్చాలి. టోటుకు-కైచ్చా (తూర్పుదేశాల అభివృద్ధి కొఱకు నిర్మింపబడిన సంఘము), దక్షిణ మంచూరియా రైల్వేవారు కూడ వారికి — కొరియన్లకు- ఆర్థిక సహాయం

చేయాలి. కొరియన్లకు మంచూరియా, మంగోలియాల్లో ఒక వున్నత స్థానమిచ్చి వారి సంపద నభివృద్ధిపర్చే మార్గాలు చూపించి, వర్తకనియంతృత్వం సంపాదించాలి మనం. కొరియన్లు యీప్రదేశాలకు వలసరావటంవల్ల కలిగే అధికార్థిక, సైనికలాభాలు గుర్తించి, ప్రభుత్వం ఆప్రజలకు చేయూత నివ్వటములో అశ్రద్ధచేయరాదు. ఈయెత్తు మన సామ్రాజ్యానికి నూతన అభివృద్ధిమార్గాల్ని చూపిస్తుంది. లాంసిన్గకు ఇచ్చికి మధ్య జరిగిన ఒడంబడిక వల్ల కలిగిన లాభాల్ని వాషింగ్టన్ మహాసభ ధ్వంసం చేసింది. మళ్ళీ మనం లాభాల్ని పొందాలంటే లక్షలాదికొరియన్లు మంచూరియాకు రావాలి. దీనివల్ల అంతర్జాతీయ సంబంధాలకేవిధమైన నష్టం కలుగదు.

— రైల్వేలు, నూతన ఖండాభివృద్ధి —

రవాణాయే జాతీయరక్షణకు మూలం, విజయానికి ఆధారము. ఆర్థికాభివృద్ధికి ప్రారంభము. చైనావారి రైల్వేలైన్లు షుమారు 7,300 మైళ్ళపొడవు వరకు వున్నై. అందులో 3000 మైళ్ళు మంచూరియా, మంగోలియాల్లో వున్నాయ్. మంచూరియా, మంగోలియాల విస్తీర్ణాన్ని, అక్కడవున్న ప్రకృతిసంపదను దృష్టిలో వుంచుకొని ఆలోచిస్తే, ప్రస్తుతం వున్న రైలురోడ్లు యేమీచాలవు. కనీసం 5, 6 వేల మైళ్ళ రైలురోడ్లు వెయ్యాల్సివుంటుంది. మన రైల్వేలైన్లు కేవలం దక్షిణ మంచూరియాలోనే కేంద్రీకరించబడి వున్నాయ్, కాని ప్రకృతిసంపద సమృద్ధిగావున్న ఉత్తరమంచూరియాలో లేవు. ఇది చాలశోచనీయము! దక్షిణ మంచూరియాలో మనసైనిక, ఆర్థిక, యెత్తుగడలకు సుముఖులై వున్న చైనీయులు చాల

మూది వున్నారు. మనం, ప్రకృతి సంపద నభివృద్ధిచేసికోవాలంటే, జాతీయ రక్షణను బలపరచుకోవాలంటే, తప్పకుండ ఉత్తరమంచూరియాలో రైల్వేలెన్నునిర్మించాల్సిందే! అప్పుడు మనం అధికంగా జపానీయుల్ని అక్కడికి పంపగలం. అక్కడి నుంచి దక్షిణ మంచూరియాలో రాజకీయార్థికాభివృద్ధి చాల వరకు బలపరచుకోగలం. శాంతి, రక్షణల పేరుతో దూర ప్రాచ్యంలో మన జాతీయరక్షణను అభివృద్ధి చేసికోగల్గుతాము. దక్షిణ మంచూరియా రైల్వే కేవలం ఆర్థిక కార్యాల కోసం నిర్మించబడింది. సైనికసమూహాల రాకపోకల కనువైన వలయాకారపు రైలురోడ్లు యేమీ అక్కడ లేవు. మంచూరియా, మంగోలియాల్లో చైనా, రాజకీయ, ఆర్థిక, సైనికాభివృద్ధుల్ని మొదలంట నాశనముచేయటానికీ, రష్యా పలుకుబడిని తగ్గించటానికీ మనం యీ నాటినుంచీ అక్కడ వలయాకారపు రైలురోడ్లను నిర్మించి, మన సైనిక నిర్మాణ కార్యాలను అమలులోపెట్టాలి. ఇదీ మన ఖండాంతర సామ్రాజ్య రాజనీతికి మూలసూత్రం.

మంచూరియా, మంగోలియాలలో రెండు పెద్ద రైలు మార్గాలు వున్నై. ఒకటి తూర్పు—చైనా రైల్వే. రెండోది దక్షిణ మంచూరియా రైల్వే. చైనీయులచే నిర్మింపబడిన రైల్వేలు, కిరిణ రాష్ట్రీయప్రభుత్వము యొక్క ఆర్థిక అండవుండబట్టి యిప్పుడు చాల ప్రాముఖ్యత జెందినాయ్. ఫేంగ్టిన్ ప్రభుత్వము, హేలంకియాంగ్ రాష్ట్రం యొక్క వుమ్మడి సహాయాలవల్ల చైనా రైల్వేలు, మన దక్షిణ మంచూరియా రైల్వేనుమించి మనతో అప్రతిహతమైన పోటీచేయటానికి ప్రారంభించవచ్చును. అదృష్టవశాత్తు ఫెంగ్టీన్ ప్రభుత్వం ఆర్థికంగా చాల

చిక్కుల్లో వుంది. మన సహాయం లేకుండ ఆవ్యవహారాలుచక్కబడవు. ఈ అవకాశాన్ని మనం వుపయోగించుకోవాలి. ఈ సందర్భంలో మనం సరియైన మార్గాన నడచి రైలుమార్గనిర్మాణం విషయంలో లాభాన్ని పొంది మనపనిని కొనసాగించాలి. మనము యేదోవిధంగా కుతంత్రముచేసి ఫెంగ్టీన్ ప్రభుత్వపు బ్యాంకు నోట్లకు (చెక్కులకు) విలువ లేకుండ జేసినామంటే, అప్పుడు, ఆ రాష్ట్రీయ ప్రభుత్వము మంచూరియా, మంగోలియాల అభివృద్ధిని గురించి ఆలోచించటానికి అవకాశము లేకుండ పోతుంది. కాని మనం తూర్పు చైనా రైల్వేను గుర్తుంచుకోవాలి. ఇది దక్షిణ మంచూరియా రైల్వేతో కలిసి "T" ఆకారంగా యేర్పడుతుంది. ఈ నిర్మాణం, మన సైనిక కార్యాలకేమీ వుపయోగించదు. మనం, దక్షిణ మంచూరియా రైల్వేను ప్రధాన భాగంగా చూస్తే, చైనీయులు వారి అవసరాలను తీర్చుకొనే నిమిత్తము వుత్తర దక్షిణాలుగా రైలుమార్గాన్ని నిర్మించుకోవలసి వస్తుంది. ఆ విధంగా మనకూ, వారికీ యేవిధమైన ఘర్షణా రాకూడదు. †ఇప్పుడు రష్యా తన పలుకుబడినంతనూ పోగొట్టుకొని, మంగోలియా, మంచూరియాల్లోనికి ఆక్రమణకొచ్చే స్థితిలో లేదు. అందువల్ల చైనీయులు చచ్చినట్లు మన రైలు రోడ్డు నిర్మాణానికి తోడ్పడాలి. కేవలం సైనిక కార్యాలకోసం ఫెంగ్టీన్ ప్రభుత్వం రెండు—టాగుచిన్ నుంచి టుస్లియాన్,

---

† సోవియట్ రష్యా ఆరోజుల్లో సోవియట్ల నిర్మాణకార్యక్రమంలో వుంది. అసలుయెప్పుడూ అనవసరంగా పరరాజ్యాలదురాక్రమణ చేయాలనే దుర్బుద్ధి లేదు. కాని ప్రపంచానికి, స్వప్రజలకు సోవియట్ మీద దుష్ప్రచారం చేయటానికి జపాన్‌కు యిదొక మార్గం.

కిరిన్ నుంచి హైలారిన్ కు — రైలుమార్గాన్ని నిర్మించినది. ఇది చాల ఆశ్చర్యకరమైన విషయం. ఈ రెండు రైలుమార్గాలూ మన సైనిక కార్యాలకు, మంచూరియా రైల్వేకు చాల ఆటంకం. మనము యీ నిర్మాణానికి పూర్తిగా వ్యతిరేకించాము. చివరకు యీ రైల్వేలు నిర్మింపబడినాయంటే దానికి కారణము దక్షిణ మంచూరియా రైల్వే ప్రతినిధులతో బాటు మన ప్రతినిధి కూడ ఫెంగ్టీన్ ప్రభుత్వ శక్తిని సరిగా నిర్ణయించలేకపోయాడన్న మాట. తీరా మనము కల్పించుకొనేటప్పటికి కాలాతీతమైనది. రైల్వే నిర్మాణము పూర్తయిందికూడ. అమెరికన్లు, హులూటావ్ రేవు పట్టణానికి పెట్టుబడి పెట్టటానికి ప్రయత్నించారు. దానిని బ్రిటీషు పెట్టుబడిదారుల సహాయంతో అభివృద్ధిపరచాలని ప్రయత్నించారు. ఫెంగ్టీన్ ప్రభుత్వం యీ అవకాశాన్ని వుపయోగించుకొని బ్రిటిషు అమెరికాల పెట్టుబడిని స్వీకరించి యీ రైల్వే నిర్మాణాన్ని పూర్తిచేసి మనపై దెబ్బతీయటానికి చూచింది. ఇపుడు మనము చేయగలిగిందంతా ఆ రెండు రైల్వేలను గురించీ చైనాతో రాయబారాలు జరపటానికి వీలయ్యే అవకాశం కోసం యెదురు చూడటమే.

ఫెంగ్టీన్ ప్రభుత్వం టున్లియో, షూయు గుండా టాగుచ్చిన్ నుంచి హార్బిన్ వరకూ ఒక రోడ్డును నిర్మించాలనే తలంపుతో వున్నట్లు యీ మధ్య ఒక రూమరు పుట్టినది. ఈ రోడ్డు తూర్పుచైనా రైల్వేకుగాని, దక్షిణ మంచూరియా రైల్వేకుగాని సరాసరి పెకింగునాయి-హార్బిన్ కు యిదిమార్గం. అత్యాశ్చర్యకరమైన విషయము యింకొకటేమిటంటే వారు, ఫెంగీన్ ప్రభుత్వం, కిరిన్, యుచన్ గుండా ముక్డెన్ నుంచి

హార్బిన్ వరకు యింకొక మార్గాన్ని నియమించుటకు ప్రయత్నము చేస్తున్నారట. ఈ రెండు నిర్మాణాలు పూర్తి అయినట్లయితే యివి దక్షిణ మంచూరియా రైల్వేను చుట్టవా? చుట్టు దనాన్ని వీలైనంత తక్కువ చేసేస్తాయి.

ఇది మంచూరియా, మంగోలియాలలో, మన రాజకీయ ఆర్థికాభివృద్ధిని సర్వ నాశనం కావిస్తుంది. నవరాజ్యాల ఒడంబడిక కోరిక నెరవేరుతుంది. మన పని అవుతుంది. ఈ రెండు రైలుమార్గాలు దక్షిణ మంచూరియా రైల్వేను యెందుకూ పనికిరాకుండా చేస్తాయి. అప్పుడు దక్షిణ మంచూరియా రైల్వే కంపెనీ ఒక క్లిష్ట పరిస్థితిని యెదుర్కోవలసి వస్తుంది. ఏది యేమైనప్పటికి, ప్రస్తుత ఆర్థిక పరిస్థితులను బట్టి, చైనా, దక్షిణ మంచూరియా రైల్వేకంటె పుత్తరముగా యీ రెండు మార్గాల్ని నిర్మించలేదు. ఇది మనకు కొంత అనుకూలముగానే యుండాలి. ఒకవేళ యీ రెండు రైల్వేలు నిర్మించబడి దక్షిణ మంచూరియా రైల్వేతో పోటీ చేసి నష్టపర్చాలని రేట్లు తగ్గిస్తే మనమేగాకుండ తూర్పు చైనా రైల్వేకంపెనీగూడ నష్టపడుతుంది. నిజానికి రష్యా జపాన్లు యీ పద్ధతికి అంగీకరించవు. ట్సెట్సికార్ నుంచి హార్బిన్ కు పంపబడేవస్తువులమీద విధింపబడే చార్జిమీదే తూర్పు చైనా రైల్వేకంపెనీ యెక్కువగా ఆధారపడివుంటుంది. ఈ రెండు కారణాలవల్ల అది అసాధ్యము.

దక్షిణ మంచూరియా రైల్వే మన అవసరాలను తీర్చలేదు. ప్రస్తుతపు మన అవసరాలను భవిష్యత్తు కార్యకలాపాలని దృష్టిలోవుంచుకొని మనము ఉత్తర, దక్షిణ మంచూరియాలలోని రైల్వేలమీద అధికారాలను పొందాలి. దక్షిణ

మంచూరియాలో మన రాజకీయ, ఆర్థిక హక్కులు భంగపడే టంత విపరీతంగా చైనీయులు పెరిగిపోతున్నారు. ఉత్తర మంచూరియాలో మన భవిష్యత్ సంపదను కాపాడుటకొరకు అక్కడ దౌర్జన్య పద్ధతుల ననుసరించవలసి వచ్చింది. ఈ రాష్ట్రములో—సోవియటు రష్యాకు చెందినదానిలో- తూర్పు చైనారైల్వే అభివృద్ధి చెందిందంటే మన నూతన ఖండాంతర సామ్రాజ్యానికి తీరనినష్టం. అదిగాక, త్వరలోనే సోవియటు రష్యాతో పోరాడవలసి వస్తుంది. ఈ విషయములో మళ్ళా వొకసారి, మనము రష్యా—జపాన్ యుద్ధములో వహించిన పాత్రనే వహించాలి. అప్పుడు దక్షిణ మంచూరియా రైల్వే మనకు స్వాధీనమైనట్లు తూర్పు చీనారైల్వేకూడ మనదే అవుతుంది. డైరినును దోచుకున్నట్లె, కిరిన్‌నుకూడ దోచుకొనవచ్చును. జాతీయవిస్తరణ కార్యక్రమములో ఉత్తరమంచూరియా సంపదను వశముచేసికోవడానికి మంగోలియాలోరష్యాతో పోట్లాట తప్పకపోవడం ఒక విషయము. ఈ నివురుగప్పిననిప్పు రగులుకొననిదే మన పప్పులు వుడకవు. మనము ముఖ్యస్థలాల్లో సైనిక రైల్వేలు నిర్మించుకునే అధికారాల్ని చైనానుంచిపొందాలి. ఈ నిర్మాణము కావడముతోనే ఉత్తర మంచూరియానంతా మన దళాలతో నింపివేయవచ్చు. అపుడు సోవియటు రష్యా తనంతటతానే కల్పించుకుంటుంది. ఇది బహిరంగయుద్ధానికి ఒక సాకుగా వుంటుందికూడాను.

మనం యీ క్రింది రైల్వేల నిర్మాణంలో నిమగ్నులము కావాలి.

(1) టున్లియో - పెచెన్ రైల్వే : ఈ మార్గం 447 మైళ్ళు పొడవు. నిర్మాణానికి 50,000,000 యెన్నులు ఖర్చవుతుంది. అంతర్మంగోలియా, అభివృద్ధి ప్రయత్నాలలో మనకమిత సహాయకారిగా వుంటుంది. ఇది తలవని తలంపుగా అతిప్రాముఖ్యమైన రైల్వే. యుద్ధమంత్రివర్గం అతిజాగ్రత్తగా పరిశోధించి అంతర్మంగోలియాలో పెద్దపెద్ద భూఖండాలు వ్యవసాయానికి - వరిధాన్యం - పనికివచ్చేవి వున్నాయని తేల్చారు. ఈరాష్ట్రాన్ని సవ్యంగా అభివృద్ధి చేస్తే కనీసం 2 కోట్లమంది జపానీయులు హాయిగా బ్రతకటానికి అవకాశము వుంటుంది. 20 లక్షల పశువులుకూడ బ్రతకటానికి సరిపోయేటంత మేతవుంది. వాటిని మన ఆహారంకోసము, యూరప్, అమెరికాల యెగుమతికోసము, వుపయోగించుకోవచ్చు. ఇంకా అక్కడ వున్నికూడవుంది. జపాన్‌లోవున్న గొర్రెలబొచ్చుకంటె మంగోలియాలోని గొర్రెల బొచ్చు మూడురెట్లెక్కువ (వుంది). ఈ విషయాన్ని నిరూపించటానికి దక్షిణమంచూరియా రైల్వేవారు చాల పరిశోధనలు చేశారు. ఆస్ట్రేలియావున్నికంటె మంగోలియావున్ని చాల శ్రేష్టమైనది. మంగోలియాలో చాలవున్ని దొరుకుతుంది. అతి చౌక. అతిశ్రేష్టం. అదే మంగోలియాకు మూలసంపద. మనరైల్వేలను అభివృద్ధిచేసి యీపరిశ్రమల్ని ప్రోత్సహించామంటే మనకు ఫలోత్పత్తి కనీసం 10 రెట్లు యెక్కువౌతుంది. ఈరహస్యాన్ని ప్రపంచానికి తెలియనీయకుండా చేస్తున్నాం, అమెరికా, ఇంగ్లండు వగైరాలు మనతో పోటీ ప్రారంభించకుండా అందుకోసం మనం ముందుగా మన అధీనంలోనికి తెచ్చుకొని ఆతరువాత పరిశ్రమల్ని అభివృద్ధి

చేయడము ప్రారంభించాలి. ఈవిషయాల్ని యితరదేశాలు గ్రహించి మనకంటె ముందుగా యీప్రయత్నాలు ప్రారంభిస్తే మనము తరువాత పరితాపపడవలసి వస్తుంది. ఈరైల్వేలను మన చేతుల్లో వుంచుకొని వున్న పరిశ్రమను అభివృద్ధి పరిస్తే మన అవసరాలేగాకుండా యితరదేశాలకు (యూరప్, అమెరికా) కూడ యెగుమతి చేయవచ్చు. మంగోలియాను ఆక్రమించుకోవటానికి మనము పన్నిన యెత్తు నిర్విఘ్నముగా కొనసాగుతుంది. మంగోలియా రైల్వేలు మనపాలసీకి జీవము. అవిలేకుండా జపాన్, మంగోలియాలో యే ఆటా ఆడలేదు.

2. సోలన్ - టయోనన్ రైల్వే

ఈ మార్గము 136 మైళ్ళ పొడవు వుంటుంది. కోటి యెన్నులు ఖర్చువుతుంది. మనభవిష్యత్తు జపాన్ చరిత్రను చూస్తే రష్యాతో వుత్తర మంచూరియాలో యుద్ధం తప్పదనే విషయం ఒప్పుకుతీరాలి. ఈ రైల్వేను నిర్మించటంతో రష్యాను వెనుకనుంచి జడిపించటమే కాకుండా వుత్తరమంగోలియాలో రష్యా క్రొత్తదళాన్ని తెచ్చిపెట్టటానికి గూడ అవకాశం వుండదు, సైనికదృష్టితో చూస్తే, ఆర్థిక దృష్టితో చూస్తే టయో- యెహ్హో కనుమలసంపదను దోచుకోవటానికి దక్షిణ మంచూరియా రైల్వేలను బలపర్చుకోవటానికి అవకాశాల్ని కలుగజేస్తాయి యీరోడ్లు. ఆచుట్టుపట్ల నున్న రాజకుమార్లు—మనకనుకకూలంగా నున్నవారు— మన పలుకుబడిని అభివృద్ధిచేయటానికి, వారి రాజ్యాలలోనికి సరాసరి మార్గమేర్పడటానికి అవకాశమేర్పడుతుంది. మంగోలియా రాజకుమారులతో మైత్రికి అవకాశాలు, భూమి, గనులు,

వచ్చిక బయళ్ళు స్వాధీనపర్చుకోవటం, స్వదేశ ప్రజలతో వ్యాపారసంబంధం భవిష్యత్తులో ఆదేశాక్రమణకు మంచి మార్గము— అన్నీ యీ రైల్వేమీద ఆధారపడి వుంటాయ్. అంటే— దీనితో టున్లియో-చెషిన్ రైల్వేలను కలిపి - రెండు రైల్వేలున్నాయన్నమాట. పరిశ్రమలు అభివృద్ధిచెందినప్పుడు బహిర్మంగోలియాలో కూడ మనపలుకుబడిని వ్యాపింపజేయటానికి వీలుంటుంది. అయినప్పటికి యిదిమనకు చాల ప్రమాదకరం. ఆరాష్ట్రంలోనికి చైనీయుల వలస కనువగు మార్గాల్ని చూపిస్తుంది. ఆవిధముగా మనపాలసీకి దెబ్బ. దక్షిణ మంచూరియా రైల్వేలను గుర్తుచుకోవాలి. అది చైనా హక్కుల్ని కాపాడదూ? ఆరైల్వేచుట్టుప్రక్కల ప్రాంతాలలో వున్న ఖనిజసంపద, భూమితోగూడ, మంగోలియా రాజకుమారులకు చెందుతుందనేది గమనించదగ్గ విషయము. ఈ భూముల్ని, ఖనిజసంపత్తినీ మనం స్వాధీనంచేసి కొన్నామంటే చైనీయుల వలస భయము యేమీ వుండదు. అప్పుడు ఆరాజకుమారులచేత చైనీయుల వలసను అరికట్టే శాసనాలు కూడ చేయించవచ్చును. వారికి బ్రతుకు దుర్భరమైనప్పుడు, ఆస్థలాన్ని విడిచిపెట్టి వారే పోతారు. చైనీయుల వలసను అరికట్టే మార్గాలు యింకా చాలవున్నాయ్. మనము శక్తివంతంగా వుంటే, మంగోలియాలో ఒక్క చైనీయుడు కూడ అడుగుపెట్టలేడు.

(3) చాంచన్ - టోనన్ మార్గం: ఈ మార్గము చాంచన్‌నుంచి ఫూయూ, డాలైలకు పోతుంది. చాంచన్ నుంచి టోనన్‌కు 131 మైళ్ళ దూరమువుంది. షుమారు 11 లక్షల యెన్నులవుతుంది. ఈలైను ఆర్థికముగా, మంచూరియా,

మంగోలియాల సంపదంతా దక్షిణ మంచూరియాలో కేంద్రీకరించబడి వున్నది, కాబట్టి- చాల ప్రాముఖ్యత వహిస్తుంది. మనము ఉత్తర మంచూరియాలోనికి ప్రవేశించటానికి అనుమతిపొంది దక్షిణ మంచూరియా రైల్వే కంపెనీకి తోడ్పడి తూర్పు చైనా రైల్వేను దెబ్బతీయాలి. ఈ రైలు రోడ్డు సుంగారినది కనుమలగుండా పోతుంది. ఆ ప్రాంతము అతిసారవంతమైనది. అక్కడ పంటలు సమృద్ధిగా వున్నాయ్. డాలై వద్ద యూవియన్ జలపాతమువుంది. దాన్ని విద్యుచ్ఛక్తి వుత్పత్తికి వుపయోగించుకొనవచ్చు. ఈమార్గం పరిశ్రమలకు, వ్యవసాయానికి కేంద్రస్థలం అవుతుంది. ఈమార్గం నిర్మించిన తరువాత యెన్యాసన్, అంచాన్, ట్సిట్సికార్ రోడ్లగుండా సైబీరియామీదికి దండెత్తటానికి డాలైని ఆధారంగాచేసికొనవచ్చు. ఉత్తర మంచూరియా ప్రకృతి సంపదంతామన చేతులోనికివస్తుంది. ఈ మార్గము హైలంకియాంగ్ మీదికిదాడికి కూడ సహాయకారిగవుంటుంది. మంగోలియాలో ఆక్రమణకు, యీరోడ్డు చాంచన్, ట్యోనన్ మధ్య రోడ్డుతోకలిసి వలయాకారంగా యేర్పడి కపటోపాయవిధానానికి తోడ్పడుతుంది. ఇక్కడి జనసంఖ్య చాలతక్కువ, భూమి అతిసారవంతమైనది. ఇంకా 50 సంవత్సరాలవరకూ యీభూములకు యెరువులు వేయవలసిన అవుసరంలేదు. ఈ రోడ్డును మన స్వాధీనం చేసికొంటే ఉత్తర మంచూరియా, మంగోలియాలలోని సంపదనంతనూ దోచుకోవచ్చు. ఇక్కడ కనీసం యింకో 3 కోట్ల మంది సుఖజీవనం గడపవచ్చును. డాన్ బాస్కీరోడ్డు పూర్తి చేసినతర్వాత హాంయిరెన్, కొరియారోడ్డుతోకలిపితే, అక్కడినుంచి అన్ని సరుకులు సరాసరి ఒసాకాకు, టోకియోకు

మొగమతి చేయవచ్చును. యుద్ధ సమయాలలో మన సైన్యాల్ని జపాన్ సముద్రముగుండా ఉత్తర మంచూరియా, మంగోలియాలకు పంపవచ్చు. అప్పుడు ఉత్తర మంచూరియాలోనికి చైనా సైనిక దళాలు ప్రవేశించటానికి అవకాశం వుండదు. కొరియా జలసంధులలో నుంచి అమెరికా, రష్యా నౌకలు రావటానికి వీలుండదు. కిరిన్–హోయినెన్; చాంచన్–డాలైరోడ్ల నిర్మాణం జరిగిందంటే ముడి పదార్థాలకు, నిల్వజేసిన సరుకులకు మనకు కొదవ వుండదు. యుద్ధసమయాలలో యేదేశం కూడ మనతో జోక్యం కలుగజేసికోన లేదు. అందువల్ల మంగోలియా, మంచూయాలతో రాయబార వ్యవహారాలు చైనా నడిపినప్పుడు మనము చెప్పినట్లు వినవలసినదే. మెజ్జి చక్రవర్తి ప్లాను ప్రకారము మూడో ఐటమ్ ననుసరించి మనము మంచూరియా, మంగోలియాలలో రాజకీయ చైతన్యం రూపుమాపాలంటే, యీ రెండు రైలు మార్గాల్ని పూర్తిచెయ్యాలి. చాంచన్–డాలై రైల్వే – దక్షిణ మంచూరియా రైల్వేకు ప్రాముఖ్యత నిచ్చి, సంపాదన కూడ అధికంగా జేస్తుంది. ఆ దేశాక్రమణకు యిది చాల ముఖ్యమైన కార్యము.

(4) కిరిన్–హోయిరెన్ మార్గం: కిరిన్–డంటుయాస్కీ రైల్వే పూర్తి ఐనప్పటికీ, డంచుయాసీ–హోయిరన్ రైల్వేను నిర్మించాలి. హోయిరెన్–లమోండీ–గ్గొగ్గొ లైను (యీ లైను వెడల్పు 2 అ. 2 అం. మాత్రమే) మన నూతన ఖండంలో ఆర్థికాభివృద్ధి కేమీ తోడ్పడదు. ఈ మార్గాన్ని వెడల్పు చెయ్యాలంటే 80 లక్షల యెన్నులు ఖర్చు పెట్టాలి. లమోండీ–గ్గొగ్గొ; హన్యాలైను నిర్మాణానికి కోటి యెన్నులు

ఖర్చు అవుతుంది. ఇది పూర్తి అయిందంటే మన ఖండాంతర పంథాలో విజయము పొందామన్నమాట! ఈ నాటివరకు మెవరైన యూరప్ వెళ్ళాలంటే డెరైన్ గుండా గాని, వ్లాడివోస్టాక్ గుండాగాని ప్రయాణము చేయాల్సి వస్తోంది. కాని మన కార్యక్రమము పూర్తయిందంటే సరాసరి త్సెన్-త్సెన్ నుంచి సైబీరియా రైల్వే మీద వెళ్ళవచ్చును. ఈ పెద్ద రవాణా పద్ధతి మన చేతులలో వున్నదంటే, మెజ్జీ ప్లానులలో మూడో ఐటమ్ ప్రకారం, మన వుద్దేశాన్ని మంచూరియా, మంగోలియాలలో దాచవలసిన పనిలేదు. అప్పుడు యామటోజాతి ప్రపంచాన్ని జయించటానికి బయలుదేరుతుంది. మెజ్జీ మనకు మరణశాసన పూర్వకంగా యిచ్చిన సొత్తు (ప్లానులు) ప్రకారం మనం మొదటగా ఫార్మోసాను తరువాత కొరియాను జయించాలి. అప్పుడు మూడో కార్యక్రమం ప్రారంభమవుతుంది. మంచూరియా, మంగోలియా, చైనాల విజయం యింతవరకు పూర్తిఅయితే మిగిలిన ఆసియా, దక్షిణ సముద్రాల దీవులు అన్నీ మన పాదాల దగ్గరవుంటై. ఈ పనులన్నీ యిప్పటివరకూ జరుగలేదంటే ఆదోషమంతా తమ నౌకర్ల దేనన్నమాట.

కిరిన్, ఫెంగ్టిన్ ప్రజలూ, హైలంకియాంగ్ లో కొంత మంది చరిత్రలో సూచాన్లు అని పిల్వబడుతున్నారు. ఆ సూచాన్లు సముద్రపుటొడ్డున, ఆమూర్, ట్యూమెన్ నదుల లోయల ప్రాంతాలలోను విడిబడి వున్నారు. వీరు అనేక కాలాల్లో (యుగాల్లో) కులాయన్లని, సూచాన్లని, గ్యూబేలని, పాలులని' ఓట్లని, ఘూయూలని, కెండాన్లని, ఖోఖ్యాలని, న్యూపెన్లనీ చరిత్రాత్మకంగా పిలువబడుతుండేవారు, వీరు

సంకరజాతివారు. ఇప్పటి మంచూరియా వంశం వారి ముత్తాతలు అక్కడే పుట్టారు. మొదట కిరిణ్ స్వాధీనపరచుకొని తర్వాత చైనాను 300 సం॥ పాలించారు.

మన ఖండాంతర పంథాను అమలులో పెట్టాలంటే మనము ఈ చరిత్రాత్మక సత్యాన్ని ఆధారముగా తీసికొని యీ రాష్ట్రములో ముందుగా నివాసము యేర్పరుచుకోవాలి. ఇకమీద కిరిన్, హాయిరెన్ రైల్వే నిర్మాణము అవసరం.

ఈ గోడ్డు చ్చిన్-ఛెన్‌తోనా, లోచిణ్‌తోనా, లేక సునిట్సెతో కూడ పూర్తిచేయటమా అనే విషయనిర్ధారణ, పరిస్థితులమీద ఆధారపడి వుంటుంది. జాతీయరక్షణ విషయములో లోచిన్ చక్కని రేవు స్థలం. మంచి కేంద్రం. ఇదే ప్రపంచములోకంతా మంచి నౌకాశ్రయస్థలం కావటానికి అవకాశాలున్నయ్. ఈ లోచిన్ ఒకవైపున వ్లాడివోస్టాక్‌ను నాశనముచేస్తుంది. రెండోవైపున మంచూరియా, మంగోలియాల సంపదకు కేంద్రస్థలంగా వుంటుంది. డైరెన్ యింకా మన అధీనములోనికి రాలేదు, మంచూరియా యింకా మన సామ్రాజ్యరాజ్యమురాలేదు కాబట్టి, యీపట్టణాన్ని అభివృద్ధి చేయటం చాలకష్టము. దాని ఫలితముగా యుద్ధ సమయాల్లో మనము చాల కష్టపడవలసివస్తుంది. శత్రువు ట్సూసిమా, సెన్నినాజలసంధుల్ని ముట్టడించగలడు. అప్పుడు మనకు మంగోలియా, మంచూరియాలతో సంబంధము తెగిపోతుంది. మన వుత్పత్తి కేంద్రాల్ని నష్టపోయామంటే, ఇంగ్లండు, అమెరికాలు మనల్ని యీరాష్ట్రాల్లో యిదివరకే పడగొట్టాలని చూస్తున్నాయ్‌కాబట్టి, మనమే జయింపబడతాము. ఎప్పు

డో ఒకనాడు స్వయంరణార్థము అమెరికాతో పోరాడవలసి వస్తుంది. చైనాకుకూడ హెచ్చరిక యివ్వాల్సివుంటుంది. ఫిలిప్పైన్ దీవుల్లోవున్న అమెరికావారి ఆసియానౌకాదళం ట్యూనిసియా, సెన్నినాలకు దగ్గరలోవుంటుంది. వారు యీ స్థలాలకు సబ్ మెరీన్లను పంపితే మంచూరియా, మంగోలియాల్లో వున్న మన ఆహారపదార్థాలనిల్వా, ముడిపదార్థాలనిల్వా స్థలాలకు మనకూ పూర్తిగ సంబంధము వదలిపోతుంది. కిరిన్-హాయిరెన్ రైలుమార్గము నిర్మాణము పూర్తయితే మంచూరియా, కొరియాలచుట్టూ, ఉత్తర మంచూరియాలో కొంతభాగముచుట్టూ ఒక పెద్దవలయాకారముగా మన రైలుమార్గము యేర్పడుతుంది. అన్నివైపులా మన రాకపోకలకు కావలసినంత స్వాతంత్ర్యము వుంటుంది. మన సైన్యాల్ని, ఆహారపదార్థాల్ని నలుమూలలకూ పంపగలము. మనము, ట్సురుగా, నిగటాలలోని రేవుస్థలాలకు యీ రైల్వేద్వారా కావలసిన పదార్థాల్ని పంపగలిగినామంటే శత్రుసబ్ మెరీన్లు జపాన్, కొరియా జలసంధులగుండారాలేవు. ఈ విషయములో యెవ్వరూ జోక్యము కలుగజేసికొనలేరు. జపాన్ సముద్రము మన జాతీయ రక్షణకు కేంద్రముగావుంటుంది.

ఆహారపదార్థాలను, ముడిసరుకుల్ని సంరక్షించుకోగలిగినట్లైతే, అమెరికా నౌకాదళానికిగాని, చైనా, రష్యాల సైన్యాలకుగాని భయపడవలసిన అవసరము వుండేదిగాదు. కొరియన్ల అలజడిని అణచగలము. ఇంకోమారు చెప్తున్నాను: మనము గనుక క్రొత్త ఖండాంతర విధానాన్ని అమలులో పెట్టదలచుకుంటే మాత్రము తప్పకుండా యీ మార్గాన్ని

నిర్మించాలి. మంచూరియా, మంగోలియాలు యేమీ అభివృద్ధిచెందని తూర్పు దేశాలు యిప్పుడుగాని, యింకాకొన్నాళ్ళకైనాగాని సోవియట్ రష్యాతో పోరాడవలసివస్తుంది. బహుశాయీయుద్ధము కిరిన్‌లో జరుగుతుంది.

మెజ్జిచక్రవర్తి ప్లానులోని మూడోభాగాన్ని చైనాలో కార్యరూపంలో పెట్టటానికి యీ క్రిందివిధంగా మనము ప్రవర్తించాలి.

1. ఫుక్యోకా, హిరోషిమాలలో మనము సైనికదళాల్ని కేంద్రీకరించి, కొరియాగుండా దక్షిణ మంచూరియాకు పంపాలి. ఆవిధంగా మనము వుత్తరానికి చైనా సైనికుల పురోగమనాన్ని అడ్డగించాలి.

2. ప్రస్తుతము నగోయా, హుయాన్సీలలో వున్న సైనికదళాల్ని సముద్రముమీదుగా ట్సిన్-ట్సిన్‌కు పంపాలి. మళ్ళీ అక్కడినుంచి గిరిన్-హాయిరెన్ మార్గము మీదుగా వుత్తర మంచూరియాకు పంపాలి.

3. నిగటాగుండాగాని, చూచిన్ గుండాగాని, లోగిన్ గుండాగాని, క్యాంటన్‌సైన్యాల్ని పంపించాలి. అక్కడినుంచి కిరిన్-హాయిరెన్ మార్గముమీదుగా ఉత్తర మంచూయాకు పంపాలి.

4. ప్రస్తుతము, హొక్కైడోలోవున్న సైన్యాల్ని సముద్రముమీదుగా ఆమోరి, హాకొడటోలనుంచి వ్లాడివోస్టాక్‌కు, అక్కడినుంచి సైబీరియా రైలుమార్గంమీదుగా హార్బిన్‌కుపంపాలి. వారు ఫింట్యూసాన్‌లో ఆగుతారు మంగోలియాను ముట్టడించి, దక్షిణానికి రష్యనుల పురోగమనాన్ని ఆపుతారు,

5. ఈదళాలన్నీ కలిసి రెండు పెద్ద సైన్యాలవుతాయ్. దక్షిణాన షాగైహుయాంగ్‌ను ఆక్రమించి చైనా దళాల వుత్తరపురోగమనాన్నుంచి దాన్నిరక్షిస్తారు. ఉత్తరాన, రష్యా సేనల దక్షిణ పురోగమనాన్నుంచి ట్సిట్సికార్‌ను రక్షిస్తారు. ఆవిధముగా మంచూరియా, మంగోలియాలలోని వస్తు సంపద అంతా మన చేతుల్లోనికొస్తుంది. ఒకవేళ యుద్ధం 10 సం॥లు జరిగినా, మనకు ఆహారపదార్థాలు, సైనిక పరికరాలు, తక్కువౌతాయనే భయంవుండదు. ఇప్పుడు గిరిన్ - హాయిరెన్ మార్గము మన రేవు స్థలాలకెంతదూర మున్నదో చూడాలి. ట్సిన్ - ట్సిన్‌ను కేంద్రంగా పెట్టుకొంటే అక్కడినుంచి వ్లాడివోస్టాక్‌కు 130 మైళ్ళదూరం; ట్సూరుగాకు 475 మైళ్లు; మోడ్జికి 500 మైళ్ళు; నాగసకికి 650 మైళ్లు; ఫూసాన్‌కు 500 మైళ్లు.

ట్సుర్గా రేవు పట్టణాన్ని కేంద్రముగా తీసికొందాము. ఈ సందర్భములో ఒకాసాను పారిశ్రామిక కేంద్రముగా తీసికోవాలి.

1. చాంచన్‌నుంచి లోగిన్ మీదుగా (భూమార్గాన్ని) ఒకాసాకు 406 మైళ్ళు. సముద్రమార్గము 475 మైళ్ళు. ఈ ప్రయాణం 51 గంటలు పడ్తుంది.

2. డైరెన్, కోజెగుండా గనుక ప్రయాణముచేస్తే చాంచన్ (భూమార్గముగుండా) ఒకాసాకు 535 మైళ్ళు. సముద్రముమీద అయితే 870 మైళ్ళు. ఈ ప్రయాణానికి 92 గంటలు పడ్తుంది.

డైరెన్‌నుంచి బయలుదేరే కంటె ట్సురుగాలో బయలుదేరితే 41 గంటలకాలము కలిసి వస్తుంది. మనము గనుక

గంటకు 30 మైళ్ళ చొప్పున భూమిమీద, గంటకు 12 చొ॥ సముద్రముమీద ప్రయాణముచేస్తే, మంచి ఓడల్ని, వేగంగా పోయే రైళ్ళని వుపయోగించి, ప్రయాణపు దూరములో 1½ వంతు తగ్గించుకోవచ్చు.

మంచూరియా, మంగోలియాలు దూరప్రాచ్యంలో బెల్జియములాంటివి. ఐరోపా మహాసంగ్రామ కాలములో (1914-18) బెల్జియం యుద్ధభూమిగా మార్చబడింది. మనకూ రష్యా, అమెరికాలకు జరిగే యుద్ధాలకు మంచూరియా, మంగోలియాలనే యుద్ధభూమిగా మార్చాలి. ఈ పైదేశాలతో తటస్థముగా వుండటం అసాధ్యం కాబట్టి, కిరిన్-హాయిరెన్, చాంచన్-డాలై రైల్వేలు, మన సైనిక కార్యాలకు చాల అవసరం కాబట్టి, నిర్మించటం చాలముఖ్యం. యుద్ధసమయాల్లో తేలికగా మన సైనిక దళాన్ని అభివృద్ధి చేయవచ్చు. శాంతి సమయాలలో ఆరాష్ట్రాలలోనికి మన ప్రజల్ని పంపి అక్కడ ధాన్యం (వరి) పండించవచ్చును. అందువల్ల యీ రాష్ట్రం మనకు ఆర్థికాభివృద్ధికి అవకాశాన్నిస్తుంది సాయుధ సైన్యాలద్వారా మనకు విజయాన్ని సమకూర్చగల అవకాశాన్ని కలిగిస్తుంది.

కిరిన్ హాయిరెన్ రైల్వే వేసవిలో పూర్తి కావాలి. ఈరోడ్డు నల్లరాతి కొండలగుండా వెళ్ళవలసివుంటుంది. సొరంగాన్ని చేయటానికి సరిక్రొత్త యంత్రాల్ని వుపయోగించాలి. అక్కడ కావలసినంత యిసుక, రాయి, పింగాణిమట్టి వగైరాలు చాల దొరుకుతాయ్, కాబట్టి యీ రైల్వే నిర్మాణములో వాటికొరకు యిబ్బందిపడ నక్కరలేదు. పట్టాలు, ట్రక్కులు, యింజన్లు, మాత్రమే మనం తేవాలి. ఈకారణాల

వల్ల మామూలుగా అయ్యేఖర్చులో మూడోవంతు ఖర్చు తగ్గటానికవకాశము వుంది. పనికూడ సగము కాలములోనే పూర్తి చేయవచ్చు.

దక్షిణ మంచూరియా రైల్వే కంపెనీవారి అధికార వర్గము అతిజాగ్రత్తతో పరిశోధనలు జరిపి, ఆరాష్ట్రాలలో 2,000,000,000 టన్నుల కలప వుందని అంచనా వేశారు. ప్రతి సంవత్సరము 1,000,000 టన్నుల కలపను మనదేశానికి యెగుమతి చేశామంటే 200 సంవత్సరాలవరకూ సరిపో తుంది. అప్పుడు మనము ప్రతిసంవత్సరము 1,000,000,000 యెన్నులను ఖర్చుపెట్టికొంటున్న అమెరికా కలపను కొనవన కర్రలేదు. మనము యీ విషయాల్ని బహిరంగముగా మాట్లాడకూడదు. ఈ విధముగా యింత ఖరీదుగల కలప మంచూరియాలో వున్నదని చైనాకుగాని, రష్యాకుగాని తెలిసిందంటే మనతో పోటీకొచ్చి యీరైలు మార్గాన్ని వారే నిర్మించవచ్చు. పైగా ఫెంగ్టీన్ ప్రభుత్వమువద్దనుంచి ఆ కలపను దోచుకొనే అధికారాన్ని అమెరికా కొనివేయ వచ్చుకూడ. అప్పుడు అమెరికా మన కాగితపు పరిశ్రమను కూడ ధ్వంసము చేస్తుంది.

కిరిన్, హైలుంగ్-లునియా కాలములోకూడ, "చెట్ల మహా సముద్రము" అని పిలువబడేది. అప్పటినుంచి కొత్త కొత్త, చెట్లను నాటుతున్నారు. ఈ అడవులలోవున్న సంపదను లెక్కించుట దుస్సాధ్యము. ఈకలపను కిరిన్నుంచి, చాంచన్-డైరెన్ గుండా ఒసాకాకు పంపాలంటే 385 మైళ్లు పోవాలి. మనము ప్రతి ఘన అడుగు (కలప) కూ 34 సెంట్లు ఖర్చు పెట్టాలి. రవాణా చెయ్యాలంటే చాల అవుతుంది.

కాబట్టి అమెరికాతో పోటీ చేయలేము. అయినప్పటికీ కిరిన్-హోయిరెన్ రైలుమార్గము నిర్మించబడిననాడు ఆదూరంలో 700 మైళ్ళు తగ్గుతుంది. అప్పుడు ఒసాకాకు సముద్రము మీదుగా 13 సెంట్లు ఖర్చు (ఘనఅడుగుకు) తోనే రవాణా చేయగలుగుతాము. అప్పుడు అమెరికాను పూర్తిగ తొలగించవచ్చును. ఒకటన్ను కలప 5 యెన్నుల లాభాన్నిస్తుందనుకొంటే— ఈ రైల్వేదయువల్ల- 20 లక్షల టన్నుల కలపమీద 1,000,000 యెన్నుల లాభము సులభముగా వస్తుంది. అమెరికానుంచి కలప దిగుమతిని నిషేధిస్తాము. ఈ చౌకధరలవల్ల సంవత్సరానికి 200 కోట్ల యెన్నుల లాభాన్ని, కొయ్య సామానులు, కాగితం పరిశ్రమలమీద సంపాదించవచ్చు.

(౩) సిన్‌చిన్ బొగ్గు గనులలో 6 కోట్లు టన్నుల బొగ్గు వుంది. ఫుషన్‌లోని బొగ్గుకంటె యీ బొగ్గు చాల మంచిది. దీనినుంచి కిరసనాయిలు కూడ తీసి మనము వుపయోగించుకొనవచ్చు, లేక చైనాకు అమ్మవచ్చు. కిరిన్-హోయిరెన్ రైల్వే, మనకు యేవిధమైన శ్రమలేకుండ అనేక సౌకర్యాల్ని చేకూరుస్తుంది. ఆ బొగ్గు ఫుషన్‌లోని బొగ్గుకు అదనంగా వుపయోగించుకొనవచ్చు. ఈ రెండు బొగ్గు గనులూ మన చేతులలోవుంటే, చైనాలోని పరిశ్రమల మూలబలము మన చేతులలో వుంటుంది. జపాన్‌కు సించిన్ నుంచి బొగ్గు పంపుతుంటే టన్నుకు 5 యెన్నులు లాభం కలుగుతుంది. ఈ బొగ్గు నుంచి అనుగతోత్పత్తులవల్ల టన్నుకు 16 యెన్నులలాభం తీయవచ్చును. మనం టన్నుకు సగటున 15 యెన్నుల లాభాన్ని అంచనా వేసికొంటే మొత్తం

మీద 200 కోట్ల యెన్నుల లాభం వస్తుంది. ఇదంతా కిరిన్-హోయిరెన్ రైల్వే మీద వచ్చే లాభంకంటే అదనంగా, ఆ రైల్వే మూలంగా వచ్చే లాభమన్న మాట. యింకా ముటాన్ నది ఒడ్డున బంగారు గనులున్నయ్. కిరిన్-హోయిరెన్ రైల్వే పూర్తయి పనిచేయటం ప్రారంభించేటప్పటికి, దక్షిణ మంచూరియా రైల్వే కంపెనీ, టిపిగోయ్ బంగారు గనులలోను, కిరిన్ పారిశ్రామిక, కలప పరిశ్రమలలోను సంపాదించిన అధికారాలను వుపయోగించుకోగల్గుతాం. వ్యవసాయక వుత్పత్తి పదార్థాలన్నీ-ఓట్లు, గోధుమలు, వగైరా-చాల, దున్నాకు దగ్గరగా దొరుకుతాయ్. అక్కడ 20 సారాయివడబోత యంత్రాలు, 30 పప్పునూనె వగైరాల మిల్లులు కూడ వున్నయ్. మనము ఆ రైల్వేను నిర్మించితే అదంతా మనసొమ్మే అవుతుంది. ఈ రైల్వే ద్వారా వర్తకం చేయటానికి 40 లక్షల యెన్నులైతే సరిపోతుంది. ఈ వ్యవసాయక వుత్పత్తుల రవాణా మన ఖర్చులకేకాక పైగా మనకు సాలీనా 2 లక్షల యెన్నుల లాభాన్నిస్తుంది. మనం, కలప, బొగ్గు, యింకా యితర వుత్పత్తులమీద లాభాల్ని చూచుకొంటే సాలీనా నికర లాభం 80 లక్షల యెన్నులు.

ఇంకా మంచూరియా రైల్వేలో మన స్థానముచాల బలబడుతుంది. కలప, గనులువగైరాల విషయములో మనకు పూర్తి అధికారాలు లభిస్తయ్. ఉత్తర మంచూరియాకు చాలమంది జపానీయుల్ని కూడ వలసపంపవచ్చును. మున్ముందుగా జపాన్‌కు, ఉత్తర మంచూరియాలోని వుత్పత్తి కేంద్రాలకు మధ్యనున్న మార్గాన్ని- ప్రయాణకాలాన్ని - తగ్గించి దగ్గరమార్గాన్ని నిర్మించాలి. హైలిన్‌నుంచి ట్సెన్-ట్సెన్‌కు

ప్రయాణముచేయటానికి మూడు గంటలు మాత్రమేపడ్తుంది. హారాయిరెన్‌నుంచి సాన్‌ఖిన్‌కు 3 గంటలుపట్టుంది. ట్యూమినులాంగదివద్దనుంచి లుటిస్ని స్టేషన్‌కు యింకామూడుగంటలు పడ్తుంది. 60 గంటలలో ఉత్తర మంచూరియాలో వుత్పత్తి కేంద్రాలకు జేరగలము. ఉత్తర మంచూరియాలోని సంపదను దోచుకోవటానికి యిది ఒక్కటే మార్గము.

4. హాన్‌చన్ రైల్వేరోడ్డు. ఈరోడ్డు 173 మైళ్ళపొడవు వుంది. నిర్మాణానికి 140 లక్షల యెన్నుల ఖర్చవుతుంది. ఈ రోడ్డు వెంబటి దట్టమైన అడవులు చాలవున్నై. కిరిన్-హారాయిరెన్‌రోడ్డును బలపర్చుకోవాలన్నా, ఉత్తర మంచూరియాలోని కలపను దోచుకోవాలన్నా యీ రోడ్డునిర్మాణము అత్యవసరము. వ్లాడివోస్టాక్ ఖర్చుతో హారాయిరెన్‌ను ప్రాముఖ్యమైన కేంద్రముగా మార్చాలంటే యిది (రోడ్డు నిర్మాణము) చాల అవుసరము. విద్యుచ్ఛక్తివుత్పత్తికి పనికి వచ్చేది, హారాయిరెన్‌కు దక్షిణముగాను, డన్హువాకు వుత్తరముగాను చిన్పోసి సరస్సుఒకటివుంది. ఈ విద్యుచ్ఛక్తి సహాయముతో మంచూరియా మంగోలియాల్లోని పారిశ్రామిక, వ్యవసాయక కార్యాలను మన అధీనములోనికి తెచ్చుకొనవచ్చును. దక్షిణ మంచూరియా రైల్వేకంపెనీవారు పరిశోధించి ఆ నది ద్వారా కనీసం 8 లక్షల (Horse Power) విద్యుచ్ఛక్తి వుత్పత్తవుతుందని తేల్చారు. ఇంతశక్తి చేతులో వుంటే మంచూరియా, మంగోలియాల్లోని పరిశ్రమలు సులభముగా మన వశమవుతాయ్. ఇంకా అనేకవిధాల లాభాలు కలుగుతాయ్ దీనివల్ల. రవాణా సౌకర్యాలకోసము అతి త్వరలో దీనిని మనము నిర్మించాలి, సింకాయ్ సరస్సు రష్యా

చైనాలచేతులలోవుంది. దాన్నికూడ విద్యుచ్ఛక్తి వుత్పత్తికి వుపయోగించవచ్చు. అందువల్ల యీ రెండు దేశాల్ని మన ప్లానులతో సంబంధము లేకుండచెయ్యాలంటే, యీ సంవత్సరముటోకియోలో జరగబొయ్యే అంతర్జాతీయఎలెక్ట్రో(విద్యుచ్ఛక్తి సంబంధమైన) మహాసభలో ఒక్కొక్క రాష్ట్రములో ఒక్కొక్క విద్యుచ్ఛక్తివుత్పత్తియంత్రశాల (**Power-House**) కంటెయెక్కువనిర్మించరాదనే తీర్మానాన్ని చేయించాలి. ఒడ్జూలోని కాగిత యంత్రశాల కూడ నిగటా, హైలిన్ వద్దనున్న కలప విషయములో కొన్ని హక్కుల్ని. యీ యంత్రశాలకు ఒక (**Power House**) ను చిన్పొసరస్సు మీద అతి శీఘ్రంగా నిర్మించాలి. హాన్చన్-హైలిన్ రైల్వేను కూడ వీలైనంత త్వరలో నిర్మించాలి. అప్పుడు, మంగోలియాలో విపరీతముగా పెరుగుతున్న ముడి సరుకుల్ని రవాణా చేయటానికి అవకాశము వుంటుంది.

ఫెన్-కిరిన్-యుచన్ రైల్వేకంపెనీ, కిరిన్ అధికారులు కలిసి హెంటుట్స్యా, ట్సెన్ట్సెన్ లకు వేరు స్థలాలుగా తీసికొని యుచన్, కిరిన్-ముక్డెన్ రైల్వేను నిర్మించాలని చూచారంటే ఉత్తర మంచూరియాలోని సంపదను స్వాధీనపర్చుకోవటానికి ప్రయత్నాలన్నమాట. హార్బిన్-హైలిన్ రైల్వేను నిర్మించామంటే మనము కిరిన్-హాయిరెన్ రైల్వేను బల పర్చుకోవటమే కాకుండా చైనా ప్లానులన్నిటినీ ధ్వంసం చేస్తామన్న మాట, తరువాత మంచూరియాలోని సంపదను ట్సెన్-ట్సెన్ రేవుకు సరాసరి పంపటానికి వీలు కలుగుతుంది. ఈ రవాణా ఖర్చు చైనా రైల్వే ఖర్చులో మూడవవంతు అవుతుంది.

సైబీరియా రైల్వే ఖర్చులో సగం అవుతుంది. అప్పుడు వారు మనతో పోటీ చేయలేరు. విజయము మనకు లభిస్తుంది.

మంచూరియాలో మొత్తం రవాణా యావత్తు అమ్మకం సాలీనా 70, 80 లక్షల యెన్నులు వుంటుంది. ఈ వర్తకమంతా మన చేతుల్లోనే వుంటుంది. మన ఉన్ని, పత్తి, సోయాబీన్సు, ఇనుము వర్తకము క్రిమాభివృద్ధి చెందుతోంది. అయినప్పటికి డైరెన్‌లో అధిక భాగం వర్తకం చైనాదే. అంతేగాకండా మంచూరియాలోని పరిశ్రమల్లో పప్పునూనె పరిశ్రమ ముఖ్యమైనది. ఈ పరిశ్రమలో మన భాగం 6% మాత్రమే. ఇంకోలో వున్న 38 (పప్పు) నూనె ఫ్యాక్టరీలలోను జపాన్‌ది ఒకటిగూడ లేదు. అన్టన్‌లో వున్న 20 ఫాక్టరీలలోను ఒకటి మాత్రమే జపాన్‌ది. డైరెన్‌లోవున్న 83 లోను 7 మాత్రం జపాన్‌వి. ఇది చాల శోచనీయమైన విషయం. మనము కోల్పోయిన అధికాలను పునరుద్ధరించుకోవటానికిగాను ముందుగా మన వ్యాపారాభివృద్ధి చేసికోవాలి. ముడిసరుకుల మీద, తయారైన సరుకులమీద నియంతృత్వాన్ని పొందామా అంటే పరిశ్రమల్లో మనకు పోటీ వుండదు. పైగా యీ పరిశ్రమలలో పనిచేస్తున్న జపానీయులికి అధిక వేతనాలిచ్చి ఆదరించి చైనీయుల్ని తీసివెయ్యాలి. మంగోలియా, మంచూరియాల్లో తయారైన మన సరుకులలో చాలమంది చైనీయులు ఒసాకాలో వర్తకం చేస్తున్నారు. వారు, చైనాలో వుంటున్న జపానీయులతో మంచి పోటీ జరుపుతున్నారు. జపాను వారి జీవిత ప్రిమాణము యెక్కువ గనుక వారికి యెక్కువ లాభాలు లేక పోతే జీవించలేరు. కాని చైనీయులకు కూడ కొన్ని కష్టాలు లేకపోలేదు.

వారికి నాసి సరుకువస్తుంది 10% పన్ను జపానీయుల కంటె యెక్కువ చెల్లించాలి. జపానీయుల కంటె ప్రతి టన్నుకు 2-70 యెన్నులు అధికంగా చెల్లించాలి. అయినప్పటికీ, మంచూరియాలో మన వర్తకులతో విజయవంతముగా పోటీజరుపుతున్నారు. ఈ విషయము మనవాళ్ళ అశక్తతను నిరూపిస్తుంది. ఈ విషయాలన్ని తలచుకొంటేనే గుండె గుభేలు మంటుంది. చైనీయులు తమంత తామే ప్రభుత్వ సహాయం లేకుండ స్వయంగా వర్తకము సాగించుకొంటున్నారు. మంచూరియాలోని జపానీయులు ప్రభుత్వము చేత రక్షింపబడుతున్నారు. ఇంకా అతిస్వల్ప వడ్డీలతో పెద్ద వాయిదాలతో పెద్ద పెద్ద మొత్తాలు ఋణాలుకూడ యివ్వబడుతున్నాయ్. అందువల్ల మనము చైనాతో కలిసి సహకార యెగుమతి సంఘాన్నొకటి స్థాపించాలి. ఆ సంఘానికి స్టీమర్లమీద, దక్షిణ మంచూరియా రైల్వేమీద ప్రత్యేకాధికారాలు వుండాలి. హాండన్ ప్రభుత్వం స్వల్ప వడ్డీతో అప్పులివ్వాలి. అప్పుడుగాని మనం చైనా వర్తకులతో పోటీ చేయలేం, మంచూరియాలో మన పరిశ్రమల్ని అభివృద్ధి చేయలేము, ప్రపంచానికంతకీ మన సరుకుల్ని పంపలేం !

మంచూరియా, మంగోలియాలలో, ఆర్థిక వ్యాపార వ్యవహారాలలో మనకు అధికారం కావాలంటే ముందుగా యీ దేశాల అమ్మకాన్నంతనూ గుత్తకు తీసికోవాలి. ఈ దేశాల అమ్మకాన్ని గుత్తకు తీసికోవట మెందుకంటే, యీ విధంగానే మన ఖండాంతర విధానాన్ని అమలులో పెట్టగలం, అమెరికా పెట్టుబడిని యెదుర్కోగలం, చైనా వర్తకుల పెట్టుబడిని తగ్గించ గలము.

మంచూరియా, మంగోలియాల నుంచి వస్తువులు డైరెన్, ఇంకోయ్, అన్టన్ రేవు పట్టణాలుగుండా రవాణా చేయబడినప్పటికి, పై విషయములో డైరెన్ అతి ప్రాముఖ్యమైన స్థలం. ఇక్కడి నుంచి ప్రతి సంవత్సరం 7,200 నౌకలు 11,565,000 టన్నుల బరువుగల వస్తువుల్ని తీసికొని వస్తూ వెళ్తూ వుంటాయ్. మొత్తం మ్యంచూరియా, మంగోలియాల వర్తకములో, పై మొత్తం, 70%. ఈ రేవు నుంచి 15 ఓడదారులు బయలు దేరుతాయ్. మంచూరియా, మంగోలియాల రవాణానంతా మన అధికారము క్రిందకు తెస్తాం. మంచూరియాలో ప్రత్యేకంగా తయారయ్యే వస్తువుల అమ్మకాన్ని గుత్తకు తీసికొనే అధికారాన్ని కూడ పొందవచ్చును. ఈ విషయములో సముద్ర రవాణాను అభివృద్ధిచేసి నికోయ్, అన్టన్ రేవు స్థలాల్ని రూపుమాపాలి. మధ్యచైనాలోను, దక్షిణచైనాలోను అత్యధికంగా పండుతున్న బీన్స్ వర్తకాన్ని జాగ్రత్తగ చూచుకోవలసివుంటుంది చైనీయులు వారి భోజనాల్లో పప్పునూనెనువాడతారు. యుద్ధ సమయాలలో యీ నూనె సప్లైని మనము ఆపివేశామంటే వారు యెంత బాధపడ్తారో చెప్పలేం. వారి ఆహారపదార్థాల మీద, రవాణామీదవున్న అధికారముతో మనము, వరి పంటను వృద్ధిచేయవచ్చు. ఫుషన్ బొగ్గునుంచివచ్చిన ఖనిజాల ద్వారా యెరువుల్నికూడ యెక్కువగా తయారు చేయవచ్చు. ఆవిధంగా చైనాలోని వ్యవసాయమంతా మనమీద ఆధారపడివుంటుంది. యుద్ధ సమయాలలో యీ యెరువులమీద దిగుమతి నిషేధాన్నిపెట్టి మధ్య దక్షిణచైనాలకు దిగుమతి గాకుండచేయాలి. ఈపనిచేస్తే చైనా చేస్తున్న ఆహార పదా

ర్ధాల రవాణాను చాలవరకు అరికట్టుంది. కాని మనఖండాంతర నిర్మాణ విషయముమాత్రము మర్చిపోగూడదు. అమెరికా, ఐరోపాలకు యెరువులుకోసము బీన్సు చాలకావాలనే విషయముకూడ మర్చిపోగూడదు. ఈ వస్తువులమీద అధికారాన్నిసంపాదించి, సముద్రముమీద, భూమిమీద రవాణాల మీదకూడ అధికారాన్ని సంపాదించిననాడు, మంచూరియా, మంగోలియాల ప్రత్యేక వస్తువులుకావలసిన దేశాలు మన అనుగ్రహాన్ని అభిలషిస్తాయ్. మంచూరియా, మంగోలియాలలోని వర్తకంమీద పూర్తిఅధికారాన్ని సంపాదించాలంటే రవాణావిధానముమీదను పూర్తి అధికారాన్ని పొందాలి. అప్పుడే మనము చైనావర్తకుల్ని నాశనము చేయగలము.

అయినప్పటికి చైనీయులు మనల్ని చూచి, నేర్చుకొని, వారి స్వంత పద్ధతులచేత మనవర్తకానికి నష్టం కలిగిస్తున్నారు. ఇప్పటివరకు, పప్పునూనెల్ని తయారుచేయటంలోను, నావికాయాత్రలలోను మనం వారితో పోటీజేసే పద్ధతుల్ని నేర్చుకోలేకపోయాం. క్రొత్తరవాణా పద్ధతిని సృష్టించగల్గితే మనము రెండువిధాల మనపంథాను అమలులో పెట్టగలమన్నమాట. ఈవ్యాపారములో చైనీయుల్ని చూచి జపానీయులు నేర్చుకొనేటట్లు విశ్వప్రయత్నాలు చేయాలి. కాని చైనీయుల్ని మనపారిశ్రామిక పద్ధతుల్ని నేర్చికోనీయరాదు. ఇంతకు ముందు మంగోలియా మంచూరియాల్లో ముడిసరుకుల కొట్టాలకు దగ్గరగా మన ఫ్యాక్టరీలు వుండేవి. ఆవిధముగా మనము చైనీయులు మనల్ని చూచి నేర్చుకోవటానికి అవకాశమిచ్చాము. వారు ఫ్యాక్టరీల్ని నిర్మించి మనతో పోటీ చేసి మనల్ని మట్టంచేశారు. అందువలన అక్కడి ముడిసరు

తుల్ని సరాసరి జపాను పంపి అక్కడే తయారు చేయించిన తర్వాత చైనాకు, యితర దేశాలకు పంపవచ్చును. ఆవిధంగా మన దేశీయులైన నిరుద్యోగులకు వుపాధి కల్పించవచ్చును. మంచూరియా, మంగోలియాలలోనికి వస్తున్న చైనీయులవలస ఆగిపోతుంది. మనపారిశ్రామిక పద్ధతుల్ని వారు నేర్చుకోవ టానికి అవకాశం లేకుండ పోతుంది. పెన్సిహో, ఆన్షా యినుప గనులనుంచి వచ్చే యినుము, ఫుషన్ బొగ్గు గనులనుంచి వచ్చే బొగ్గు చైనాకు పంపి వస్తువుల్ని తయారు చేయించవచ్చు.

ఇదంతా సముద్ర రవాణా నభివృద్ధి చేయటానికి చెప్పు తున్నాను. డైరెన్ కంపెనీని (కిజెన్-కైషా,) అభివృద్ధిపర్చి, దక్షిణ మంచూరియా రైల్వే చేత మన ప్రభుత్వం యెక్కువ వడ్డీతో పెట్టుబడి పెట్టించాలి. వచ్చే సంవత్సరం సముద్ర రవాణాకు మనకు 50,000 టన్నుల వస్తువులు వస్తై. దీన్ని బట్టి దూరప్రాచ్యంలో వర్తకం చాలభాగము మనహస్తగత మైనదని తేలుతుంది. భూమిమీద రవాణాను గ్యారంటీ చేయటానికి మనకు దక్షిణ మంచూరియా రైల్వేవుంది. మంచూరియా, మంగోలియాలలోవుత్పత్త్యే పదార్థాలలో అధికభాగముమీద మనకు రవాణా అధికారమువుంది. మనం డైరెన్‌ను కేంద్రస్థలంగా చేసికొన్నామంటే, ఆర్థిక సూత్రా లనుబట్టికూడ, విజయం మనకే లభిస్తుంది.

## — సువర్ణప్రమాణము అవుసరము —

మంచూరియా, మంగోలియాలు మన కార్యకలా పాలకుపయోగ పడుతున్నయ్‌గాబట్టి, అక్కడ చెలామణీఅయ్యే నాణేల్లో ప్రధానమైనవి వెండివి. ఇది మనసువర్ణప్రమాణాన్ని

వ్యతిరేకించి మన హక్కులకు భంగము గలిగిస్తుంది. ఆ ప్రాంతాలలో జపానీయులు ధనవంతులు కాలేకపోయారంటేదానికి కారణము, చైనీయులు యీ వెండి ప్రమాణాన్ని పట్టుదలతో నిర్వహించుకొస్తున్నారు. కాబట్టి మనము అక్కడ వలన యేర్పాటులను, నిర్మాణయుక్తమైన ఆర్థిక బలంతో, చేయలేం. మనము యీ క్రింది కారణాల ఫలితంగా నష్టాలు పొందుతున్నాము.

1. మంచూరియాకు, సువర్ణ ప్రమాణాన్ననుసరించి డబ్బునుతీసికొనిపోతున్నాము. అక్కడ చైనావెండి డోలర్లకు మన బంగారునాణేల్ని మార్చుతున్నాము. అలామార్చటం వల్ల డోలర్‌కు 20 % వంతున జపానీయులు నష్టపోతున్నారు. స్పెక్యులేషన్ సర్వసాధారణవృత్తి. అందువల్ల పెట్టుబడి అంతా జూదానికి వుపయోగపడుతోంది. ఒకడు(జపానీయుడు) వ్యాపారములో 2,00,000 యెన్నులను పెట్టుబడిపెట్టాడంటే చైనా వెండి నాణాలమారకమువల్ల యెప్పుడో ఒకనాడు యే 160,000 డాలర్లకో 150,000 డాలర్లకోతగ్గిపోతుంది. ఆవిధముగా దివాళాతీసిన వాళ్ళు చాలమందివున్నారు.

2. చైనా వర్తకుడు కేవలము వెండి నాణాలతోనే వ్యాపారముచేస్తాడు. అందువల్ల యీమారకపురేట్లు హెచ్చుతగ్గులవల్ల నష్టము అతనికేమీవుండదు. చైనీయులకు వెండి, బంగారు మారకపురేట్ల విషయములో ఒక నిశ్చితాభిప్రాయం లేకపోయినప్పటికి, అన్నిరకాల వ్యాపారాల్లోనూ విజయులౌతున్నారు. ఇది వారికి (Natural Gift) సహజసంపద, మనకు తీరనినష్టము. మనకు బ్యాంకుల సహకారమువున్నప్పటికి నష్టముకలుగుతోంది. ఈ హెచ్చుతగ్గుల మారకపు

రేట్లవల్ల, మధ్య, దక్షిణ చైనాలు ప్రత్యేకముగా బీదను, చైనావద్దనే కొనుక్కొంటున్నాయ్. ఈ విషయములో మనము చేయగల్గింది దేమీలేదు. చైనానంత జయించాలి.

3. ప్రచారములో వున్న జపాన్ డబ్బు హెచ్చుతగ్గులనుబట్టి చైనా ప్రభుత్వం, బ్యాంకు నోట్లను లెక్కించగలదు. [ దాని ఫలితంగా ] అందువలన చైనాలో జపాను డబ్బు యెక్కువ చేయటానికి వీలులేదు.

4. మనము గనుక సువర్ణ ప్రమాణాన్ని అమలులో పెట్టామంటే, యిష్టమొచ్చినట్లుగా బ్యాంకు నోట్లను యీ ప్రమాణాధారంగా చెలామణి చెయ్యవచ్చును. ఈ బ్యాంకు నోట్ల సహాకారంతో సహజమైన అచలన సంపదను మన స్వాధీనం చేసికొని చైనా వెండి నాణాలకు విలువలేకుండ చేయవచ్చును. అప్పుడు చైనీయులు మనతో పోటీ చేయలేరు. మంచూరియా, మంగోలియాల్లోని డబ్బు ప్రచారమంతా మన ఆధీనంలో వుంటుంది.

5. మూడు తూర్పు రాజ్యాల ప్రభుత్వపు బ్యాంకు, రవాణా బ్యాంకు, సరిహద్దు బ్యాంకు (Frontier Bank), జనరల్ క్రెడిట్ & ఫైనాన్సియల్ బ్యాంకు 380 లక్షల డోలర్ల వెండి, బ్యాంకు నోట్లు ప్రచారంలో వున్నాయ్. వారి నిల్వ, భవనాలమీద, వస్తువుల మీద, 1,350,000 డోలర్లకు తక్కువ లేకుండ వుంది. ఈ చైనా బ్యాంకు నోట్లకు విలువ లేకుండచేయటం చాల అవసరం. ప్రభుత్వం యిచ్చిన హామీ వల్ల ప్రచారంలో మాత్రమే వుంటాయ్. చైనా వెండి, బ్యాంకు నోట్లకు, విలువలేకుండ చేయనంతకాలం మన బంగారానికి యేమీ విలువవుండదు. మంచూరియా, మంగోలి

యాల్లో ఆర్థిక అధికారం కూడ రాదు. ఈ విలువలేని వెండి బ్యాంకు నోట్లతో మూడు తూర్పు రాజ్యాలు తనకు కావలసిన వస్తువుల్ని కొనుక్కొంటున్నయ్. మన హక్కులకు భంగం కలుగుతోంది. మనము యేమైన సరుకులు కొన్నప్పుడు బంగారం కావాలంటారు. ఈ బంగారాన్ని, చైనాలో మన హక్కుల్ని, వర్తకాన్ని ధ్వంసంచేయటానికి తిరిగి వుపయోగిస్తారు. ఇందువలన సువర్ణ ప్రమాణం అవసరం.

మంచూరియా ప్రభుత్వపు వెండి, బ్యాంకు నోట్లకు విలువలేకుండ జేసి, ఆ ప్రభుత్వానికి కొనుకోలుశక్తి లేకుండ జెయ్యాలి. అప్పుడు మన బంగారు, బ్యాంకు నోట్లను చెలామణీ చేసి మంచూరియా, మంగోలియాల్లో ఆర్థిక వ్యాపారాన్ని లాక్కోవచ్చును. మూడు తూర్పు రాజ్యాల ప్రభుత్వాన్ని ఒత్తిడిచేసి ఆర్థిక శాస్త్రవేత్తల్ని తెప్పించి అక్కడి ఆర్థిక విషయాలలో మనకు ప్రత్యేకత కలిగేటట్లు చేయాలి. ఎప్పుడు చైనా వెండి, బ్యాంకు నోట్లకు విలువపోతుందో అప్పుడు మన బంగారు బ్యాంకు నోట్లు ఆస్థానం ఆక్రమించుకుంటాయ్.

## ఇతరరాజ్యాలు కూడ పెట్టుబడి పెట్టేటట్లు ప్రయత్నాలు జరగాలి.

వంశపారంపర్యముగా వస్తున్న విధానము ప్రకారము, మంచూరియా, మంగోలియాల్లో మూడోరాజ్యాన్ని పెట్టుబడి పెట్టనీయగూడదు. అయినప్పటికి నవరాజ్యాల ఒడంబడిక జరిగినప్పటినుంచి అంతర్జాతీయ సిద్ధాంతాన్ననుసరించి అన్ని రాజ్యాలకు పెట్టుబడిపెట్టటానికి సమాన హక్కులివ్వబడ్డాయ్.

అందువల్ల మంగోలియా, మంచూరియాలు మన పలుకుబడికి దూరములో వుండిపోయినాయ్, అరాజకత్వం వ్యాపించింది. ఇతర రాజ్యాలు మనము చేసే ప్రతిపనినీ ప్రతిక్షణం అనుమానాంతో కనిపెట్టానే వుంటాయ్. అందుచేత పరప్రభుత్వాల చేత విద్యుచ్ఛక్తి ఉత్పత్తి యంత్రాలలోను, సారా పరిశ్రమలోను పెట్టుబడి పెట్టించాలి. అమెరికా, యిరోపాల పెట్టుబడులతో, మన ప్లానుల ప్రకారము మంచూరియా, మంగోలియాలను అభివృద్ధిపరచవచ్చును. ఆవిధముగా యితర దేశాలకు అనుమానపడటానికి అవకాశాన్నివ్వకుండా, పెద్ద ప్లానులకు మార్గాలన్వేషిస్తూ, పరదేశాలచేత, ఆ దేశములోని మన అధికార ప్రాబల్యతను గుర్తింపచేయాలి. ఇతరదేశాల పెట్టుబడుల్ని తప్పకుండా తీసికోవాలి. కాని చైనాను మాత్రం వాటితో వర్తకంచేయనివ్వగూడదు. మంచూరియా మంగోలియాలో మన అధికార ప్రాబల్యతను యితరదేశాలచేత గుర్తింపజేయించాలంటే రాజకీయార్థిక విషయాలల్లో తప్పకుండా చైనాతో ఐక్యము కలిగించుకోవాలిసొస్తుంది. ఇతరరాజ్యాలతో చైనాకువున్న రాజదూత కార్య సంబంధమైన వ్యవహారాల్లోనికికూడ మన పంథాను వ్యాపింపజేయటానికితగుప్రయత్నాలు జెయ్యాలి.

— దక్షిణ మంచూరియా రైల్వే సంస్కరణ అవసరాలు —

ఆక్రమణ సమయాల్లో దక్షిణ మంచూరియా రైల్వే కొరియాగవర్నరు జనరల్‌లాగ ప్రవర్తిస్తుంటుంది. మనము ఖండాంతర సామ్రాజ్యాన్ని స్థాపించాలంటే యీ కంపెనీ నిర్మాణాన్నింతనూ మార్చాలి. మనకున్న బాధల్నితొలగించుకోవాలి. ఈకంపెనీ చేయవలసిన పనులు చాల వున్నై.

క్యాబినెట్‌లో జరిగే ప్రతిమార్పు దక్షిణ మంచూరియా రైల్వే అధికారవర్గములో మార్పును గలిగిస్తూ వుంటుంది. ఈ రైల్వే కంపెనీ కార్యకలాపాలు క్యాబినెట్‌లో గుర్తింప దగిన మార్పును కలిగిస్తూంటాయ్. అంటే ఈ రైల్వే కొంత ప్రభుత్వాధికారాలు కల్గివుందన్నమాట. కాబట్టే యితర రాజ్యాలు యీకంపెనీని రాజకీయాంగంగా చూస్తారుగాని, వ్యాపార సంస్థగా చూడరు. ఎప్పుడు యీ రైల్వే కంపెనీ మంచూరియా మంగోలియాల అభివృద్ధికి ప్రయత్నము జేస్తుందో అప్పుడే ఆరాజ్యాలు, నవరాజ్యాల ఒడంబడికను యెత్తుకొని యీ కంపెనీ నాశనం చేయటానికి చూస్తాయ్. ఇది, నవరాజ్యాల ఒడంబడిక, మన హక్కులకు యెంతో భంగం కలిగించింది. ఈ రైల్వే నలుగురి అధీనంలో వుంది. హాండన్ గవర్నరు, డైరెన్‌లోని అధికారప్రతినిధి, ముక్డెన్ లోని జనరల్ కన్‌సల్ రైల్వే కంపెనీ అధ్యక్షుడు అధికారులు రైల్వే కంపెనీ యేకార్యమైనా చేయబోయేముందు యీనలుగురు, సర్వాధికారాలుగల రాజప్రతినిధులు, డైరెన్ లో సమావేశమవ్వాలి. ఈ సమావేశాలు యెంత రహస్యముగా జరిగినప్పటికి మూడు తూర్పు రాజ్యాల అధికారులకు యీ సమావేశాలు పూర్తి వివరాలు తెలుస్తాయి. క్రొత్త యెత్తుగడల్ని కొనసాగించటానికి యేమాత్రం అవకాశాల్నివ్వకుండా మధ్యనైనా అధికారాల్ని ఆమూడు తూర్పు రాజ్యాలు ఒత్తిడిచేస్తాయి. పైగా ఈ రైల్వే కంపెనీ విదేశాంగ మంత్రివర్గము, రవాణా మంత్రివర్గము, యుద్ధ మంత్రివర్గము, ఆర్థికమంత్రివర్గము యొక్క అభిప్రాయాల్ని తెలిసికొని యేపనైనా చేయాలి. ఇందులో యేఒకటి మంత్రి

వర్గమైనా వారి వుద్దేశాలతో యేకీభవించక పోయిందంటే యీ రైల్వే కంపెనీకి అధికారాలు సూన్యమన్నమాట. ఇందు వల్ల మన ప్రస్తుత ప్రధాని తన ఓటమిని ఒప్పుకొన్నప్పటికీ విదేశాంగమంత్రివర్గము బాధ్యత, నెత్తిన పెట్టుకొన్నాడు. ఇక యిప్పుడు మంచూరియాలో మన విషయాన్ని రహస్యము గా వుంచుకొనవచ్చును. కాబట్టి దక్షిణ మంచూరియా రైల్వేను సంస్కరించాలి.

ఇప్పటివరకు యీ కంపెనీ వుద్యమాలన్నీ ద. మం. రైల్వే కంపెనీ యాజమాన్యము క్రిందవుండే స్వాతంత్ర్య కంపెనీలుగా మార్చాలి. అప్పుడు మంచూరియా, మంగోలియాలను జయించటానికి అవసరమైన కార్యాల్ని ప్రారంభించవచ్చు. తరువాత దక్షిణ మంచూరియా రైల్వేలో చైనీయులకు, యూరోపియన్లకు, అమెరికన్లకు పెట్టుబడి పెట్టటానికి అవకాశమివ్వవచ్చును. కాని ఆబాండులలో అధికసంఖ్యమా తము మన చేతుల్లోనేవుండాలి. ఈ రైల్వే మన అధీనంలో నేవుంటుంది. అప్పుడు యింకా యెక్కువ వేగంగా మనఖండాంతర సామ్రాజ్యవిస్తీర్ణతకు ప్రయత్నాలు జరపవచ్చును. ఇతర రాజ్యాల చేత ద. మం. రైల్వేకంపెనీ అభివృద్ధికి పెట్టుబడులు పెట్టిస్తున్నామంటే ప్రపంచాన్నే మోసము చేస్తున్నామన్నమాట. ఈ కార్యక్రమము ముగిసిన తర్వాత స్వేచ్ఛగా మంచూరియా, మంగోలియాల్లోనికి జొరబడి వెళ్ళవచ్చును. నవరాజ్యాల ఒడంబడిక పీడబదుల్తుంది. విదేశీయపెట్టుబడులతో మన అధికారాల్ని బలపర్చుకోవచ్చును.

**దక్షిణమంచూరియా రైల్వేకుచెందిన పెద్ద వుద్యమాలు:**

**1. ఇనుము, ఉక్కు పరిశ్రమలు.**

మన జాతీయాభివృద్ధికీ, ఇనుము, వుక్కు పరిశ్రమలకూ చాల దగ్గర సంబంధమువుంది. అయినా (ముతకలోహం) గనులు లేకపోవటంవల్ల యీ సమస్య పరిష్కారముగాకుండా వుంది. ఇప్పటివరకూ యాంగ్ టెజ్ వాలీ (లోయ) నుంచీ, మలయా పెనెన్సులానుంచీ వుక్కునుదిగుమతి చేయవలసి వచ్చింది. జనరల్ హెడ్ క్వార్టర్సు వారి రహస్య పరిశోధన సలిపి మంచూరియా, మంగోలియాల్లో పెద్ద పెద్ద యినుప గనులున్నాయని తెలిపారు. తాజా పరిశోధనల ప్రకారము అక్కడ కోటిటన్నుల ఇనుమువున్నదని అంచనా వేయబడింది. ఇనుమును బాగు చేయుటము సంపూర్ణముగా తెలియని రోజులలో ఆషాన్ (వుక్కు, యినుము) వర్క్సు అనే కంపెనీకి సంవత్సరానికి 30 లక్షల యెన్నులు నష్టంవచ్చేది. తరువాత, తరువాత క్రొత్త పద్ధతులు పెట్టబడిన తర్వాత యీ నష్టము తగ్గినది. 1926 లో ఆ కంపెనీ 150,000 యెన్నులు, 1928 లో 800,000 యెన్నుల లాభాన్ని పంచి యిచ్చింది. మార్టిన్ ఫర్నెస్‌ను గనుక పూర్తిగ పరిశోధించామంటే సాలీనా, షుమారు 40 లక్షల యెన్నుల లాభంవస్తుంది. పెన్షి యినుము చాల మంచిది. అన్‌షన్ ఖనిజం, పెన్షి యినుము మన స్వాధీనంలో వున్నాయంటే యినుము, వుక్కు వస్తువుల్ని సరఫరా చేసే విషయంలో ఒకరిమీద ఆధారపడ నక్కర లేదన్న మాట.

మంచూరియా, మంగోలియాలలో దగ్గర దగ్గరగా 12000 లక్షల టన్నుల యినుము, 25000 లక్షల టన్నుల బొగ్గు వున్నది. అక్కడ వున్న బొగ్గుతో అక్కడి యినుమును వస్తువులుగా తయారు చేయడానికి సరిపోతుంది. ఈ రెండు

సంపదలూ చేతులోవుంటే 70 సంవత్సరాల వరకూ మన కేమీా ఫర్వాలేదు. ఒక టన్ను వుక్కు-మీాద 100 డోలర్లు లాభం వస్తుందనుకొంటే 3,500 లక్షల టన్నుల మీాద 3,50,000 లక్షల యెన్నుల లాభం వస్తుంది. ప్రతిసంవత్సరం దిగుమతి అయ్యే యినుప సామానులకయ్యే, 1200 లక్షల యెన్నుల ఖర్చుకూడ కలిసి వస్తుంది. మన పరిశ్రమలకు కావలసినంత యినుము, బొగ్గు, వుక్కు- వున్నై. ఈ విష యములో ప్రపంచములో మొట్టమొదటి రాజ్యం మనదే! తూర్పు, పడమరలలో మనదే పైచెయ్యి అవుతుంది. ఇందు కోసం దక్షిణమంచూరియా రైల్వేను లోహ పరిశ్రమల్నుంచి వేరుచెయ్యాలి.

## 2. నూనె.

అత్యావసరమైన వస్తువులలో, మనకు నష్టము వస్తున్న వస్తువు, కిరసనాయిలొకటి. ఇది మన దేశానికి చాల అవుసరం. అదృష్టవశాత్తు ఫూషన్ బొగ్గు గనుల్లో 52,000 లక్షలటన్నుల ముడినూనె(కిరసనాయిలు)వుంది.అందులోనుంచి(6%) 3120లక్షల టన్నుల మంచినూనె, పొగ ఓడలకు, మోటారుకార్లకు పనికి వచ్చేది, తయారౌతుంది. ప్రస్తుతము జపాను 700,000 టన్ను లనుదిగుమతిచేసికొంటోంది. ఫూషన్ గనులనుంచి 5%చొప్పున 2500 లక్షల టన్నుల మంచినూనెను తయారు చేయవచ్చు. ఇంకా రేటుహెచ్చించి 9% చొప్పున తీస్తే 4500 లక్షల టన్నులనూనె తయారౌతుంది. సగటున 3400 లక్షల టన్నుల ప్రకారము అంచనావేసికొంటే ఫూషన్ గనులు 22500 లక్షల యెన్నులుయిస్తాయ్. ఇది మనకు గొప్ప పారిశ్రామిక విప్లవ మౌతుంది. జాతీయరక్షణను, జాతీయ సంపదను దృష్టిలో పెట్టె

కొనిచూస్తే నూనె సమస్య చాల గొప్పవిషయము. మనకు మంచూరియానూనె, యినుము వున్నదంటే మన సైనికదళము, నావికాదళము అభేద్యమైన శక్తులుగా వుంటాయ్. మంచూరియా, మంగోలియాలు నిస్సందేహముగా జపాను రాజ్యానికి గుండెకాయ.

—అమ్మోనియా సల్ఫేట్ వగైరా వ్యవసాయక ఎరువులు—

ఆహారపదార్థాల వుత్పత్తికోసము వ్యవసాయక యెరువులు అవుసరము. రసాయన యెరువులకోసం అమ్మోనియా బొగ్గునుంచి తీయవచ్చును. ఈ విషయములో ఫూషన్ బొగ్గు చాలమంచిది. ప్రస్తుతము మనము 500,000 టన్నుల అమ్మోనియా సల్ఫేట్ నువుపయోగిస్తున్నా, అందులోసగం ఫూషన్ గనులనుంచి వచ్చేబొగ్గుతో జపాన్‌లో తయారుచేస్తున్నాము మిగిలిన సగము యితర దేశాలనుంచి సంవత్సరానికి 350 లక్షల యెన్నులను ఖర్చుపెట్టి తెప్పిస్తున్నాము. మంచూరియా మంగోలియాల్లో నూతన సామ్రాజ్యాభివృద్ధి జరగాలికాబట్టి, మన వ్యవసాయము కూడ అభివృద్ధి చెందుతోంది కాబట్టి, వచ్చే పది సంవత్సరాలకు, మనకు పది లక్షల టన్నుల అమ్మోనియాసల్ఫేట్ కావాలి. ఫుషన్ బొగ్గుతో వుక్కును కరగించేటప్పుడు వచ్చే వుపద్రవ్యాలనుంచి కావలసినంత అమ్మోనియాసల్ఫేట్ వుత్పత్తవుతుంది. సంవత్సరానికి 300,000 టన్నుల అమ్మోనియాను వుత్పత్తి చేశామంటే సాలీనా ఆదాయములో 4 కోట్ల యెన్నులు అధికమౌతుంది. వచ్చే 50 సంవత్సరాలలోను

20000 లక్షల పౌన్నులలాభాల్ని పొందగలుగుతాము. ఈ డబ్బుతో వ్యవసాయాన్ని అభివృద్ధిచెయ్యాలి. ఇంకా సొమ్ము మిగిలితే యెరువుల్ని కొని చైనాలలోని వ్యవసాయకోద్యమాలన్నింటికీ సప్లై చేయవచ్చును. ఈ వ్యాపారంకూడ ద. మం. రైల్వేతో సంబంధము వుండకూడదు. అప్పుడు దూరప్రాచ్యంలోవున్న అన్ని యెరువుల వుత్పత్తి స్థానాలు మన అధీనంలో వుంటాయ్.

సాలీనా కోటియెన్నులు ఖర్చుపెట్టి 1000,000 టన్నుల సోడాను దిగుమతి చేసికొంటున్నాము. సైనిక, పారిశ్రామిక కార్యాలకు సోడా, సోడా ఆష్ రెండూ చాల అవుసరము. మంచూ., మంగో. ల్లో వుప్పు, బొగ్గుచాల దొరుకుతుంది. వాటినుంచి సోడా తయారు చేయవచ్చును. ఈ పరిశ్రమను కూడ ప్రారంభించామంటే మన అవసరాలు తీరటమేగాకుండా చైనాకుకూడ అమ్మవచ్చును. ఈవ్యాపారములోకూడ మనం నియంతృత్వాన్ని సంపాదించవచ్చు. సాలీనా 150 లక్షల యెన్నులకు తక్కువలేకుండ ఆదాయాన్ని పొందవచ్చును. దీన్నికూడ ద. మం. రైల్వే అధనంలోనుంచి తప్పించాలి.

## — మాగ్నిషియా, అల్యూమినియమ్ —

ద. మం. రైల్వే యిచ్చిన ఆచూకీనిబట్టి—టోహోకు విశ్వవిద్యాలయము ప్రొఫెసరు డాక్టరు హన్ట్ దృఢముగా చెప్పిన విషయాలను బట్టి మంచూరియాలో చాల అల్యూమినియమ్ వుందని స్పష్టమౌతోంది. టాషిచాకు దగ్గరలో మాగ్నిషియా యెన్టాయ్‌కి దగ్గరలో అల్యూమినియమ్ దొరుకుతాయ్. ఇక్కడ ప్రపంచములోనికంతకీ పెద్ద గనులు

న్నాయ్. ఒక టన్ను మాగ్నిషియా ఖరీదు 20,000 యెన్నులు. అల్యూమినియమ్ ఖరీదు 17,000 యెన్నులు. మంచూరియాలో వున్న ఆ ఖనిజాల మొత్తం ఖరీదు 7500 లక్షల యెన్నులు. యీ లోహాలు ప్రత్యేకముగా విమానాల నిర్మాణానికి, మందు సామానులకు (వైద్య సంబంధమైన) ఓడలకు వుపయోగపడ్తాయ్. అమెరికా సంయుక్త రాష్ట్రాలలో మాత్రమే అధికంగా వున్నాయ్. అంతే యింకెక్కడా లేవు. రోజు రోజుకూ యీ లోహాల అవసరం యెక్కువౌతోంది. సప్లై తగ్గిపోతోంది. ఖరీదులు విపరీతంగా పెరిగిపోతున్నాయ్. మంచూరియా, మంగోలియాలలో వున్న యీ లోహాల గనులు భగవత్ప్రసాదం. అవి మన పారిశ్రామిక కార్యాలకు జాతీయ రక్షణకు చాల అవసరం. యీ పరిశ్రమనుకూడ దక్షిణ మంగోలియా రైల్వేకు సంబంధము లేకుండ జెయ్యాలి. ఈ లోహాల్ని జపాన్ తీసికొనిపోయి— ఫెంగ్టీన్ ప్రభుత్వము మనల్ని చూచి నేర్చుకొనకుండాను బ్రిటిషు, అమెరికాలు మన అభివృద్ధిని గమనించకుండాను— అక్కడ వస్తువుల్ని తయారు జెయ్యాలి. ఆ మూడు తూర్పు రాజ్యాలలోని ఆ లోహసంపదను దొంగిలించిన తర్వాత యానది జలపాతాన్ని యంత్ర నిర్మాణానికుపయోగించుకో వచ్చు. వైమానిక నిర్మాణం అధికమౌతోంది కాబట్టి ముందు, ముందు ప్రపంచము అంతా వైమానిక నిర్మాణానికవసరమైన వస్తువుల్ని మన వద్దనుంచే తీసికొంటాయ్.

యీ వుద్యమాలన్నీ స్వతంత్రముగా వున్నాయంటే త్వరలో అభివృద్ధిచెంది మనకు సాలీనా 600 లక్షల (6 కోట్లు) యెన్నులకు తక్కువ లేకుండా లాభాన్నిస్తాయ్. దక్షిణ మంచూరియా పారిశ్రామికాభివృద్ధి మన జాతీయ రక్షణకు, ఆర్థి

కాభివృద్ధికి యెంతో అవసరం. మన పారిశ్రామిక సామ్రాజ్యానికి పునాది వేస్తాయన్నమాట. మంచూరియా, మంగోలియాలలో విజ్ఞానసమస్థల అభివృద్ధికి హాస్పిటళ్ళు, స్కూళ్ళు మొదలగువాటికి—రక్షక భటులు. అవి మన గౌరవాన్ని, అధికారాన్ని వృద్ధిచేస్తాయ్. ఉత్తర మంచూరియాలో జొరబడటానికి యెక్కువ అవకాశంకోసం దక్షిణ మంగోలియా రైల్వేకు సంబంధములేకుండ వుండాలి.

ఈ పెద్ద వుద్యమాలు మన అధికారులతో సంబంధం లేకుండవుంటే జాతీయ సంపదకు మూల ధనాలుగా వుంటాయ్. మూడు తూర్పు రాజ్యాలకు అనుమానం కలుగకుండాను, జపాను వ్యతిరేక వుద్యమాన్ని లేవదీయకుండాను అతి త్వరగా మనము మన కార్యాల్ని కొనసాగించాలి. యీ హెచ్చరిక మార్గాలతో మన క్రొత్త ఖండాంతర సామ్రాజ్యాన్ని నిర్మించగలం.

దక్షిణ మంగోలియా రైల్వేకు పెట్టిన విదేశీయ పెట్టుబడులు అందుకొరకే వుపయోగించుకోవాలి. మనచేత నిర్మింపబడి నామకా చైనా చేతిలోవున్న రైల్వే కంపెనీలు యిదివరకే నిర్మింపబడిన రైల్వేలతో కలిసి పోవచ్చును. లేదా స్వతంత్రించి వ్యాపారాన్ని కొనసాగించవచ్చును. అదంతా పెట్టుబడి పెట్టే దేశాలమీద ఆధారపడి వుంటుంది. "సమాన హక్కులు!" అనే నినాదం విదేశపెట్టుబడుల్ని సంపాదించటానికీ, ఉత్తర మంచూరియాలో మన కార్యక్రమాన్ని గురించి అనుమానించకుండా వుండటానికి వుపయోగపడ్తుంది. ఖండాంతర సామ్రాజ్య విస్తరణకు విదేశీపెట్టుబడులు చాల అవుసరం. దక్షిణ మంగోలియా రైల్వేకు పెట్టుబడి పెట్టటానికి, విదేశీయ ప్రభుత్వాలకు, అవకాశం యిచ్చా

మంటే యింకా కావలసినంత పెట్టుబడిని సంతోషముతో పెడ్తాయ్. చైనా అందుకు వ్యతిరేకంగా యేమీ చెయ్యలేదు.

మంచూరియాలో మన యెత్తుగడలు కొనసాగించటానికి యిదిమంచి మార్గము. మనం కాలాతీతము చెయ్యకుండా వుత్తర మంచూరియాలోను, మంగోలియాలోను కేంద్రీకరించబడిన సంపద విషయములో ఒకేమార్గాన్నే అనుసరించాలి. కిరిన్‌నుంచి హోయిరెన్ రోడ్డుకి చాంచన్ నుంచి డాలైరోడ్డుల నిర్మాణాన్ని, కలప, గనుల వుద్యమాన్ని ప్రత్యేక వుద్యమాలుగా, విడతీయాలి.

ఉత్తర మంచూరియాలోని దోపిడి మంచూరియా రైల్వేను చాలవరకు ఆర్థికము అభివృద్ధిపరుస్తుంది. విదేశ రాజ్యాలను ద. మం. రైల్వేకు పెట్టుబడి పెట్టటానికి అవకాశాన్నిచ్చి లాభాల్నికూడ పంచి యివ్వాలి. లాభాల్ని పంచుకోవటం ప్రారంభించారంటే మంచూరియాలో మన కార్యకలాపాల్ని అడ్డుపెట్టడము మానివేస్తారు. దక్షిణ మంచూరియాకు అనేకమంది చైనీయులు వలసవస్తున్నారు. వారిస్థితి రోజురోజుకూ బలపడుతోంది. మన దేశీయుల స్థితి నానాటికి నీచస్థితికొస్తోంది. మన ప్రజలకు ప్రభుత్వపు అండవున్నప్పటికీ, చైనీయుల జీవితపరిమాణం తక్కువకాబట్టి వారితో పోటీ చెయ్యలేం. చైనీయులకు పెద్ద మొత్తాలు పెట్టుబడులు పెట్టుబడులు పెట్టి తద్వారా వారిని బాధపెట్టడమే మనము చేయగల్గినపని. ఈ పనిచేయటానికి విదేశీయ పెట్టుబడులు కావాలి. ఉత్తర మంచూరియాలోని సంపదనంతా దక్షిణ మంచూరియా సంపదతో కలిపిననాడు మన సమస్యలన్నీ పూర్తిగ వెంటనే తీరతాయ్. ఈ కార్యక్రమములో నెగ్గకపోతే వుత్తర మంచూరియాలో అధికారాన్ని స్వాధీనపర్చుకొనే ఆహార పదార్థాలు, ముడిసరుకులు సప్లై చేయవు.

జపాను, వుత్తర మంచూరియా అధికారులకు దగ్గర సంబంధము వుందిగాబట్టి మనం వెంటనే వుత్తర మంచూరియాకు వెళ్ళి, అక్కడ మన పంథాను అమలులో పెట్టాలి.

— వలసరాజ్యశాఖ యేర్పాటు —

మంచూరియాలో జపాన్ దోపిడి అనేక రకాలుగా వుంటుంది. చాలమంది ప్రముఖులు, అతిలాభకరమైన వుద్య మాలు కూడ చివరకు విఫలమాతాయని అభిప్రాయపడుతు న్నారు. మనం మందకొండితనంగా పనిచేస్తే ఆవిషయాన్ని, ముక్డీప్రభుత్వం, సాకుగా తీసికొని మనమీద వ్యతిరేక ప్ర చారం సాగిస్తుంది ఏదైనా ఒక వుద్యమాన్నిగురించి ప్లాను వేయాలంటే డైరైన్‌లో కనీసం డజను సభలలోనైనా ఆ విషయాన్ని చర్చించాలి. పైనచెప్పిన ఆనలుగురి సమ్మతే గాక ప్రభుత్వం సమ్మతికూడ కావాలి. అందువల్ల యేదైనా పని ప్రారంభించాలంటే కొన్ని నెలలు ఆలోచించటానికి, సమ్మతిని పొందటానికే పడుతుంది. ఈలోపున చైనీయులు మన రహస్యాల్ని బట్టబయలుచేసి వారే ఆకార్య క్రమాన్ని కొనసాగించటానికి ప్రయత్నిస్తారు. అప్పుడు ప్రపంచం అంతా మనకు వ్యతిరేకమాతుంది. గాన మంచూమంగోలలో ఆవిధం తీరని నష్టాలపాలై పోతాం. మనకు వ్యతిరేకంగా వున్న పార్టి (ఎక్స్‌పార్టి) యీసదపకాశాల్ని వుపయోగించు కొని ప్రభుత్వంమీదికి దండెత్తటానికి ప్రయత్నిస్తుంది. అప్పుడు మనపనిని మార్చుకోవలసి వస్తుంది. ఈకార్యకలా పాలు కేంద్రస్వాధీనం టోకియోకు మార్చాలి. ఈ మార్పు మన రహస్యాలను చైనా తెలిసికోకుండా చేస్తుంది. మనం పని ప్రారంభించక పూర్వమే యితర రాజ్యాలు తెలిసికోవ టానికి అవకాశము లేకుండాపోతుంది. మన అధికార ప్రా బల్యాని వృద్ధిచేసి మంచూరియా, మంగోలియా అధికార

వర్గానికి, సెంట్రల్ ప్రభుత్వానికి మధ్య సంబంధాన్ని వృద్ధి పరుస్తుంది. ఇది చైనాకు, మనకున్న సంబంధ బాంధవ్యాలు విషయంలో చాల అవసరం. ఇందువల్ల ఇటో, కిట్సురాల ప్లానుల ప్రకారము మున్ముందుగ కొరియాను కబళించి అక్కడ వలస రాజ్యశాఖనొకదానిని యేర్పాటు చేయించి ఆశాపే, మంచూరియా, మంగోలియాలలో మనరాజ్య విస్తరణకు పాటుబడ్తుంది. పేరుకు మాత్రం ఫార్మోజా, కొరియా, సఖాలిన్ రాజ్యాల అధీనంలో వున్నట్లుగా కనిపిస్తుంది. కాని యదార్థంగా మంచూరియా, మంగోలియాల్లో జపాన్ అధికార వ్యాప్తికి ప్రయత్నిస్తుంది. ఈయెత్తు ప్రపంచాన్ని మోసముచేయటానికి బాగా వుపయోగపడ్తుంది. మన రహస్యాల్ని యెవ్వరూ తెలుసికోవటానికి వీలుండదు.

ఇటోకాలములో కొరియా ఆక్రమణ జరగలేదంటే దానికి కారణము అప్పుడు సరియైన మార్గాలలో నడచివుండలేదని అనుకొంటాను. అదీగాక అప్పుడు పూర్తిగ అభిప్రాయభేదాలుండేవి. అందువల్ల రహస్యపంథాను అమలులో పెట్టడం జరగలేదు. ఇది ఇతరదేశాలు అడ్డుపెట్టటానికి, కొరియన్లు తిరగబడటానికి అవకాశాన్నిచ్చింది. యిరోపాలోను, అమెరికాలోను, కొరియాలోను ప్రచారకులు బయలుదేరి మనము కొరియాకు స్వాతంత్ర్యము యిస్తామని ఆరాజ్యముమీద మనకేవిధమైన హక్కులేదని ప్రచారముచేశారు. దాని ఫలితంగా యింకోమారు అంతర్జాతీయ నమ్మకాన్ని మనము చూరగొనవచ్చునన్నమాట. ఫార్మోజాకు అనిచెప్పి ఒక వలసరాజ్యశాఖను సృష్టించినామంటే మన పనులు చక్కగా నెరవేర్తాయ్. వలసరాజ్యాభివృద్ధికి, ప్రత్యేకంగా ఒకసంస్థ వుండాలని తెల్లవతాలోంది. జపాను వునికికి, మంచూరియా, మంగోలియాల్లో

రాజ్యస్థాపన చాలముఖ్యం. మనపంథాను రక్షించుకొనటానికి ప్రత్యేకంగా వలసరాజ్యశాఖను ఒకటిటోకియోలో స్థాపించాలి. అక్కడి అధికారులు ఆర్డర్లను శిరసావహించవలసినదేగాని, తదితర విషయములలో జోక్యము కలుగజేసికొనరాదు. ఈ విధంగావుండటమువలన తదితరరాజ్యాలు మనవలస కార్యకలాపాలకు సంబంధించిన రహస్యాలను తెలిసికోవటానికి అవకాశమువుండదు. అప్పుడు మన రహస్యాలు యెవ్వరికీ తెలియవుగాబట్టి, నిర్భయముగా మన పనిచూచుకోవచ్చు యింకొకరి జోక్యములేకుండా.

దక్షిణ మంచూరియా రైల్వే అధీనముక్రిందవున్న, భూమిసంఘము, ట్రస్ట్ కంపెనీ మొదలైన వుద్యమాలు వలసరాజ్యశాఖ అధీనములో వుండాలి. ఇవన్నీకలిసి జపాన్ ప్రభుత్వము అధీనములోవుండి మంచూరియా, మంగోలియాలలో నూతనఖండాంతర సామ్రాజ్యస్థాపనకుపాటుబడాలి.

**—పెకిన్-ముక్డెన్ రైల్వే ప్రక్కనవున్న టాలెన్‌నది లోయ—**

టాలెన్‌నది లోయచాలపెద్దది కాని జనసంఖ్య బహు తక్కువ. ఆప్రదేశమంతా బందిపోటుదొంగలకుఆటపట్టు. చాలమంది కొరియన్లు ధాన్యపుపంటలమీద పెట్టుబడులు యెక్కువగాపెట్టారు. ముందు ముందు ఆరాష్ట్రము అభివృద్ధిచెందే సూచనలున్నయ్. ఇక్కడినుంచి పెచెన్‌లోనికి త్వరగా వెళ్ళటానికి మంచి మార్గాలున్నయ్. ముందు మన అధీనములోనున్న కొరియన్ల దక్షిణ యేర్పాటులుచేసి తరువాత చైనావద్దనుంచి, మన ప్రజల వలసకు అవసరమైన అధికారాన్ని సంపాదించాలి. జపాన్ దేశపు కాందిశీకులు, మంచూరియాలో, పెచెన్‌లోను సుఖజీవనము చేయటానికి యేర్పాటులు గావించాలి. యుద్ధ సమయములలో యీ లోయ సైన్యాలకు రహస్య

స్థానంగావుంటుంది. అప్పుడు చైనీయుల్ని వుత్తరంగారాకుండా అడ్డటమేగాకుండా, దక్షిణ మంచూరియాలోని సంపదనంతా మన కైవశముచేసికొనవచ్చును. కొరియన్లు యెవరైనా యీ రాష్ట్రాలకు వలసవస్తే వారికి స్వాగతమిచ్చి అవసరమైతే మన ఆర్థిక సంస్థలద్వారా ఆర్థిక సహాయము చెయ్యాలికూడ. ఈ సంస్థలకు ఆస్తిహక్కులువుండాలి. కొరియన్లకు భూమిలో పనిచేసి తర్వాతరావచ్చు ఫలితాన్నిమాత్రమే అనుభవించే హక్కులివ్వాలి. అయినప్పటికీ పైకిమాత్రము కొరియన్లకు ఆస్తిహక్కులిచ్చినట్లు కనుపించాలి. ఈ విధంగా చైనా ప్రభుత్వమువద్దనుంచి అధికారాల్ని సంపాదించాలి. ట్రస్ట్ సొసైటీలు, ఆర్థికసంస్థలు, మన కొరియన్ ప్రజలు భూమిని సంపాదించుకొనుటకుచేసే ప్రయత్నాలలో పూర్తిగ చేయూత నివ్వాలి. జపాన్ వలసప్రజలకు అందుబాటులో వుండేలాగు అక్కడి వరిపంటలను మన ఆధీనము చేసికోవాలి. కొరియన్ల భూముల్ని మన ప్రజలు స్వాధీనము చేసికొంటే వారుక్రొత్త భూముల్ని ఆక్రమించుకొంటారు వాటినికూడ ముందు ముందు మన ప్రజలే స్వాధీన పరచుకొంటారు. ఇది, వరి, బీన్ పంటల పరిశ్రమల్ని స్వాధీనపర్చుకోవటానికి మనపంథా. పశువులమేత విషయంలో అభివృద్ధి సంఘం (Development Society) నికి పూర్తి స్వాతంత్ర్యంయిచ్చి పెద్ద పెద్ద పశువులమందల్ని మన స్వాధీనంలో వుంచుకోవాలి. ఈసంఘం మంగోలియా గుఱ్ఱాల్ని మేసి మన జాతీయ రక్షణకు తోడ్పడాలి.

— చైనీయుల వలస వ్యతిరేక పోరాటం —

చైనాలోని అంతఃకలహాలవల్ల మంగోలియా, మంచూరియాలకు చాలమంది చైనీయులు వలస రావలసి వస్తుంది. వీరివలన మనప్రజల వలసకు పెద్ద దెబ్బ ఐంది. ఈవిషయంలో

అవసరమైన కార్యాల్ని నెరవేర్చాలి. పైగా చైనా ప్రభుత్వం కూడ యీవలసను సమర్థిస్తూ వుండబట్టి మన వలసకు యింకా ప్రమాదం వొచ్చింది. అమెరికా దేశీయుడొకడు చైనానుగురించి చెపుతూ, ముక్డెన్ ప్రజలు ఆరాజ్యంలోనికి వలసరానియ్యడానికంగీకరిస్తున్నారని చెప్పాడు. ఈవలస పంథానుబట్టిచూస్తే ముక్డెన్ ప్రభుత్వం నిర్మాణపంథా బయల్పడుతుంది. ఇదిమన అధికారాలకు భంగకరం. ఈ వలసను మనం అరికట్టకపోతే పదిసంవత్సరాలలో మన విధానంతోనే మనల్ని కూలుస్తారు. రాజకీయ (దృష్టితో చూస్తే) ంగా చైనీయుల వలసను ఆపటానికి పోలీసు (అధికార) ల్ని వుపయోగించాలి. మన ఆర్థిక సంస్థలు చైనీయులకు జీతాలను తగ్గించి తరిమివెయ్యాలి. మనం యెక్కువగా విద్యుచ్ఛక్తి నుపయోగించి అన్ని పనుల్ని చేయించాలి. వీలైనంతవరకు మానవుని శ్రమశక్తిని వుపయోగించటం తగ్గించాలి.

— వైద్యశాలలు, పాఠశాలలు —

మంచూరియాలోని వైద్యశాలలు, పాఠశాలలు, దక్షిణ మంగోలియా రైల్వే కంపెనీమీద ఆధారపడి వుండకూడదు. అవి సామ్రాజ్యవాదం అంగాలని అందరికీ తెలియును కాబట్టి యెవ్వరూ వాటి సహాయాల్ని పొందనభిలషించరు. వాటిని స్వతంత్ర సంస్థలోగా మారిస్తే, అప్పుడు ప్రజలు ఆ సంస్థలకు విలువనిచ్చి మనకు కృతజ్ఞులుగావుంటారు. ముందు స్త్రీపురుషు ప్రాథమిక పాఠశాలల్ని నెలకొల్పాలి. ఈ పాఠశాలల్లో జపాన్ యందు అభిమానం పుట్టేవిద్యను బోధించాలి. ఇది వైజ్ఞానికవిషయాలలో మనం అనుసరించవలసిన మొదటిసూత్రం.

— —

బెజవాడ, వాణీ ముద్రాక్షరశాల యందు ముద్రింప బడియె.

# టానకా యెవరు?

టానకా 1929 సెప్టెంబరు 26 తేదీన తన 66 వ యేట చనిపోయాడు. అతడు 1927 ఏప్రియల్‌నుంచి 1929 జులైవరకు జపాన్ ప్రధానిగావున్నాడు. మొదట టానకా సేనాని. అతని పూర్తి సైనిక అనుభవమంతా రష్యా మంచూరియా యుద్ధాల్లోనే. 1905లో రష్యా జపాన్ యుద్ధంలో రష్యా ఆర్థర్ రేవుపట్టణాన్ని ముట్టడించినప్పుడు యితడు మార్షల్ కొడామా అధికారవర్గానికి నాయకుడు. 1915 లో సైన్యానికంతకూ వుపనాయకుడు. చివరకు యుద్ధమంత్రిగా మూడు క్యాబినెట్లలో పని చేశాడు. ఆపదవిలోవుండే, బ్రిటిష్, ఫ్రెంచి, ఇటాలియన్, అమెరికా సంయుక్త రాష్ట్రాల సైనిక దళాలతో సైబీరియాలో సోవియట్ రష్యాతో 1918, '19 సం॥లో జోక్యంకలిగించుకోవటానికి బాధ్యుడితడే.

ఈ విజ్ఞాపనయొక్క ప్రాముఖ్యత యిటీవలనే చైనా పత్రికల్లో ప్రకటించబడింది. అప్పటి నుంచీ అనేక భాషల్లో ప్రకటించబడుతూ వచ్చింది. జపాన్ ప్రభుత్వం దీన్ని కాదనలేకపోయింది. నేటికి తెలుగులోనికికూడ అనువాదం అయింది. ఈ విజ్ఞాపనలోని కార్యక్రమాన్ని కొనసాగించటానికే జపాన్ యీనాటి వరకూ ప్రయత్నిస్తోంది.

—సంపాదకుడు.

# మా ప్రచురణలు

* రవ్వలు
( కథాసంపుటి )

*

* దీపావళి
( కథాసంపుటి )

*

* భగ్నజీవి
( జీవిత గాథ )

*

విద్యుల్లత
( ఖండకావ్యం )

*

సోవియట్ వీర వనితలు
( రష్యన్ కథలు )



... రాబోయేవి ...

ప్రేమ అంటే ?
( తత్వవిమర్శ )

*

అన్న
( నవల )

*

ప్రేమ లేఖలు
( నవల )

* కాపీలు అయిపోయాయ్





విజ్ఞాన సాహిత్య వనం

